ఓం

# శ్రీరామకృష్ణోపనిషత్తు

శ్రీ చ. రాజగోపాలాచారి ప్రణీతము

అనువాదకులు:

గౌ. న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు :: మద్రాసు-600004

# ప్రకాశకుల విజ్ఞప్తి

మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ చ. రాజగోపాలాచారిగారిచే స్వయముగా తమిళమున రచియింపబడి, మాచే 1950 న ప్రచురింపబడిన శ్రీరామకృష్ణోపనిషత్తుయొక్క ఆంధ్రీకరణమును పాఠకలోకమునకు సమర్పించుట కెంతయు సంతసించుచున్నాము.

ఈ మూడేండ్ల స్వల్పవ్యవధియందే ఈ గ్రంథము హింది, గుజరాతి, బెంగాలీ, కన్నడము, ఆంగ్లము — ఈ భాషలలోని కనువదింపబడినది. ఇదియే ఈ గ్రంథప్రాశస్త్యమును జాటుచున్నది.

అనేక రచయితలు, మతసామరస్య నిలయుడగు శ్రీరామకృష్ణపరమహంస జీవితోపదేశములను వివిధమార్గముల రచియించిరి. కాని శ్రీ రాజాజీగారు ప్రత్యేకమార్గ మవలంబించిరి. శ్రీ రామకృష్ణపరమహంస చరిత్రాంశములను నీతికథలను పాఠకుల హృదయముల తక్షణమే హత్తుకొని ఆకర్షించువిధమున మృదుమధురముగ వీరు రచించిరి. నిజముగా ఆధ్యాత్మిక జీవితమును గడపు విధానమును శ్రీ రామకృష్ణదేవుడు అనుష్ఠానపూర్వకముగ జూపుటయు వివిధమతసామరస్యము నుద్బోధించుటయు నిందు ధారాళమును సులభసుందరమునగు శైలియందు, పిన్న పెద్ద లెల్లరకు హృదయరంజకమును ఉపయుక్తమునగు విధమున రచింపబడియున్నది.

మా ప్రియమిత్రులు గౌ. న్యాయమూర్తులు శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు ఈ గ్రంథము నాంధ్రమున

ననువదించి మమ్ము నిజముగా ఋణగ్రస్తుల గావించియున్నారు. ఆంధ్రీకరణము సర్వాంగసుందరమై భాసింపగలందులకు వారు హృదయపూర్వకముగా ప్రయత్నించియున్నారు.

పాఠకుల సౌకర్యార్థము మే మీ గ్రంథమునకు నామ మాత్రమగు మూల్యము నేర్పఱచియున్నాము.

ఈ గ్రంథమున నుల్లేఖింపబడిన శ్రీ రామకృష్ణదేవుని పవిత్ర బోధనలు పాఠకుల హృదయమున హత్తుకొని వారికి నూతన జీవనము ననుగ్రహింపగలిగినచో మా శ్రమ సార్థక మగును.

విద్యారంగమున 1952-53 వ సంవత్సరమున మతము, మనస్తత్త్వమునందును ఈ తమిళ గ్రంథము తమిళాభివృద్ధి సంఘమువారిచే ప్రథమ గ్రంథముగా పరిగణింపబడి బహుమతి గాంచినది. శ్రీ రాజగోపాలాచారిగా రత్యంత ప్రేమ పూర్వక ముగా బహుమతి పైకము రూ. 500-00 మా మఠమున కొసగి నందులకు వారికి హృదయపూర్వకాభివందనము లర్పించు చున్నాము.

20-11-1954 ప్రకాశకులు



# తొలిపలుకు

నేను కొంతకాలము క్రిందట ఢిల్లీనుండి తిరిగివచ్చిన తరువాత శ్రీ రామకృష్ణ బోధనామృతము ఇతరులకు తెల్పుటకుగాను నా శక్తి సామర్థ్యముకొలది 'కల్కి' అను పేరుగల తమిళ వారపత్రికలో కొన్ని వ్యాసములు వరుసగా ప్రచురించితిని. మొట్టమొదట ప్రచురించిన వ్యాసములను బహుసంకోచముతో వ్రాసితిని, కాని యవి చదివిన మిత్రులు వానిని కొనియాడి నాకు ఉత్సాహము జనింపజేసిరి. ఈ రీతి ఈశ్వరకృపచే శ్రీ రామకృష్ణ భగవానుని బోధనుగురించి ప్రతివారము వ్రాయు ఆనందము నవిచ్ఛిన్నముగా పొందితిని.

ఈ 35 అధ్యాయములు దీపావళిరోజున పూర్తిచేసితిని. శ్రీ రామకృష్ణ మఠమువారి కరుణచే ఈ వ్యాసములు పుస్తక రూపమున ప్రచురించు ఆశయము నెరవేరినది. మఠముయొక్క పాలకవర్గమువారు నేను వ్రాసినది ఆదరించి ఆమోదించుట నా భాగ్యమే. యమధర్మరాజు నచికేతునకు చెప్పినట్లు కేవలము శాస్త్రములు పఠించినమాత్రమునగాని, కుశాగ్రబుద్ధిచేతగాని, పాండిత్యమువలనగాని, తర్కమువలనగాని పరమాత్మసందర్శనము లభింపనేరదు, ఈశ్వర కటాక్షము ఒకటియే అవసరమైనది. కాని దానిని బడయుటకు భక్తితో హృదయము కరగవలయును. భక్తి అనగా శాస్త్రపాండిత్యముకాదు. సంస్కృత శాస్త్రములు వల్లెవేసి ఎడతెగకుండ ఒప్పచెప్పవచ్చును. ఆచార్యులు వ్రాసిన భాష్యములు నేర్చి తలక్రిందుగా చెప్పవచ్చును. కాని సత్ప్రవర్తన, సమత్వముగల మనస్సు వేరు; ఇవి అంతకన్న ముఖ్యావసర భాగ్యములు. హృదయము పరిపక్వముగానిచో శాస్త్రపాండిత్యము, శాస్త్రబోధన కోతులు చేయు వట్టి అనుకరణమువంటిదే. హృదయములో జ్ఞానోదయము కలుగనిచో పాండిత్యమంతయు నిష్ప్రయోజనము. లోపల

మన్నది, బయటమన్నది, ఒకటైనప్పుడే మనకు జ్ఞానము కలుగును. అట్లు కానిచో మన పాండిత్యము చిత్తులు నేర్పబడిన కోతిచేష్టల వంటిదే యగును. శ్రీ రామకృష్ణుని బోధలు మనకు పాండిత్యము మాత్రమే గాక నిజమైన జ్ఞానము నొసంగును. యువకులు, వృద్ధులు, శ్రీ రామకృష్ణుని బోధలను చదివి లాభము పొందుదురుగాక!

15-11-1950

చ. రాజగోపాలాచారి



# విషయసూచిక



# శ్రీ రామకృష్ణోపనిషత్తు

## 1. భగవంతుడు

శ్రీ రామకృష్ణపరమహంస బోధనామృతము ఉపనిషత్తనుట అతిశయోక్తి కానేరదు. పూర్వకాలపు ఋషుల వంటి జ్ఞానసిద్ధుడు మనయుగములో నవతరించెను. ఆ మహానుభావుడే రామకృష్ణపరమహంస. ఆ మహనీయుడు పుస్తకములు వ్రాయలేదు. ఉపన్యాసముల నీయలేదు. నిజమయిన సన్న్యాసియొక్క జీవయాత్ర సల్పి పరమపదించెను. భక్తి పరిపూర్ణులై శ్రవణ కుతూహలముతో ఆసీనులైయుండు నిజ శిష్యకోటితో ఆయన ప్రసంగించుచుండెను. గురుదేవుని యమృతవాక్కులు శిష్యబృందము వ్రాసియుంచిరి. అదియే ఆయన బోధనామృతము.

వాగ్విజృంభణగల విద్యావంతులు ఉత్కృష్టములగు వ్యాసరచనలు ఉపన్యాసములు చేయుదురు, చేయగలరు. అయితే అవి జీవకళాశూన్యములు. శ్రీరామకృష్ణుడు గొప్ప మహాత్ముడు. పరమేశ్వరుని తన హృదయకమలమునందును బాహ్యప్రపంచమందలి సర్వవస్తుతతియందును సందర్శించెను. మనము ఒకరినొకరెంత స్పష్టముగ, ఎంత నిశ్చయ బుద్ధితో, చూతుమో అటులనే ఆ మహనీయుడు భగవంతుని ప్రతి

వస్తువునందును జూచెను. ఇట్టి అద్భుత ద్రష్టలు అప్పుడప్పుడు వివిధ దేశములం దవతరించుచుందురు.

దైవభక్తితో జీవించు మహాపురుషుల వాక్కులం దొక యసాధారణశక్తి యుండును. వానిలో కేవలము విద్యావంతులును, మేధావులునుసల్పు నుపదేశములలో లేని యొక మహత్తరశక్తి కానవగును. ఒక మహర్షి సంభాషించునపుడు అతని బుద్ధిమాత్రమే కాక యావజ్జీవశక్తియు ప్రదర్శితమగును. మీమాంసవాదనలు, వ్యాఖ్యానములు చక్కనివియై బహుభావపూరితములైనను ఈశ్వర ప్రేరితులయిన మహాత్ముల సంభాషణలతో సరికావు.

రాజకీయముగా మన ప్రజలకు స్వాతంత్ర్యము చేకూరినది. స్వాతంత్ర్యముతో బాటు సౌఖ్యముకూడ సమకూరుటకు మనవారు ధర్మమార్గము నవలంబింపవలెను. అప్పుడే జీవితమునగల సుఖమును, మహనీయతయును, చేకూరును. ''భగవంతుడేమి? ఈశ్వరుడేమి?'' అని యీ కాలములో పెక్కు జనులు నిరసింప సాహసింతురు. ఇది మన దురదృష్టము. ఈ ప్రపంచమునంతటిని, ఒక దానినుండి మఱియొకటి అందుద్భవించు అద్భుతమైన పెక్కు వస్తువులను, మహత్తరములయిన శక్తులను మనము చూచుచున్నాము. అంతయు నియతి ననుసరించి నడచును, పరివర్తించును. నియతి యనునది తనంతట తానే ఉదయింపనేరదు గదా! మూలకారణమగు ఒక బీజము నుండి తప్ప ఇదంతయు రానేరదు. శూన్యమునుండి ఏ

వస్తువుగాని, శక్తిగాని, నియతిగాని జనింపదు గదా! బుద్ధికిని, వాక్కునకును అతీతమై అవి అందుకొనజాలక తిరిగి వచ్చు వస్తువొకటి యుండితీరవలెను. అదియే పరమాత్మ. విధి ప్రకృతిలోనే యిమిడియున్నదనియు, అందుచే భగవంతుడు సర్వమునకు కారణభూతుడని యూహింప నవసరము లేదనియు అనుట ఈశ్వరుని స్థానమున ప్రకృతి నుంచుట యగును. ఇమ్మాడ్కి భగవంతుని వీడి ప్రకృతిని పెద్దజేయుట సమంజసము కాదు.

మనము భగవంతుని జూడజాలము. ఇది సత్యమే. అంతమాత్రమున అతడు లేడని చెప్పనగునా? రాత్రివేళ మనము తారాగణములను పరికింతుము. పగటియందవి యదృశ్యములగును. అందుచే నవి లేవని భావమా? మనము కించిద్జ్ఞులము. మనదృష్టి సంకుచితము. అందుచే మనము దేవుని చూడలేము. ఆ కారణమున భగవంతుడు లేడనియు, అత డనవసరమనియు జెప్పరాదు.

శ్రీ రామకృష్ణు డొకానొక దినమున ఈ విధముగ నుడివెను: ‘‘ఒకడు మహాపట్టణమునకు వచ్చును. ముందుగ తన సామానుల నుంచుకొనుట కొక బస నేర్పాటు చేసికొని, తదుపరి పట్టణము చూచుటకు వెళ్లును. పగలంతయు తిరిగి రాత్రి విశ్రాంతి తీసికొనుటకు తా నేర్పఱచుకొనిన బసకు వచ్చి చేరును. ముందుగా నేర్పాటు చేసికొననిచో పగలంతయు వినోదములను చూచి తిరిగినపిదప రాత్రి తలదాచుకొనుటకు తావు లేక బాధపడును. అటులనే యీ ప్రపంచములో అల్లాడు

నాత్మకు భగవంతుడు విశ్రాంతి గృహము. అట్టి గృహమును సంపాదించుకొనుట తెలివిగలపని. అటుల చేయనిచో సుఖము, మనశ్శాంతి లేక మనము కష్టముల పాలగుదుము. కుమారా! నీవు నీ జీవిత సుఖములు పాసిన తరువాత నీకు అంధకారమయమగు కాలము వచ్చును. అట్టితఱి మనశ్శాంతి చెందుటకు నీకొక శరణ మవసరము. అదియే భగవంతుడని మనమిప్పుడే తెలిసికొనుట మన కర్తవ్యము.

త్రాగుటకు జలము సేకరించుటకై నీవు కుండను చెరువులో ముంచునపుడు పైనున్న నిర్మలోదకమునకై కుండను నెమ్మదిగా ముంచెదవుగాని గభాలున ముంచి నీటిని కదల్చి మురికిచేయవు. నీవు హృదయమాలిన్యము పోగొట్టుకొని ధర్మవర్తన సల్పనెంచితివేని దృఢభక్తితో ధ్యానము, ఉపాసన ఆచరింపుము. శాస్త్రవిమర్శలచే, మీమాంసా తత్త్వవాదనలచే కాలము వృథాపఱచి నీ మనస్సును కలవరపఱచుకొనకుము. మనము కించిద్జ్ఞులము. మనబుద్ధి చిన్నగుంటయందలి లోతులేని నీళ్లవంటిది. మన మెక్కువ కలకపఱచినచో అడుగుననున్న బురద పైకివచ్చును.

పెరుగునుండి వెన్న గ్రహింపవచ్చును. ఇది సామాన్య విషయమే. అయితే "పెరుగులో వెన్న యున్నది" అని యెన్నిమారులు వల్లించినను వెన్న లభింపదు. బ్రహ్మమును పొందుటకు మనలోని ఆ హృదయవాంఛను భక్తితో చిలుకవలెను. జీవాత్మ పరమాత్మలను గుఱించి విద్వత్తర్కములు చేయుట చాలదు. తల్లిని కానని పసిబిడ్డ తల్లికి

గాంచుటకు ఎట్లు ఆవేదనతో పరితపించునో అదేరీతిగ మనము భగవంతుని కొఱకా వేదనపడి హృదయమును కరగించుకొనవలెను.

## 2. మతభేదములు

మనము పలుమార్గముల భగవంతు నుపాసించి అతని దర్శనమును, కృపను బడయవచ్చును. నదిలో ననేక ఘట్టములుండవా! ఆ రీతిగ ఆనందపూర్ణప్రవాహమయిన ఈశ్వరునందు పలుఘట్టము లుండును. ఉదకము గ్రహించుటకును, స్నానమాచరించుటకును ఏ ఘట్టములోనైనను దిగనగును. చిత్తశుద్ధితో, దృఢభక్తితో నడచుకొనిన ఏ మతమయినను సరియే, ఏ మార్గము ననుసరించినను సరియే మన మీశ్వరుని చేరవచ్చును. మెట్లనెక్కిగాని, నిచ్చెన మూలమునగాని, త్రాటిసాహాయ్యమున గాని యింటి పైయంతస్తు చేరగలము. అదేరీతిగ వివిధమతములు పలుమార్గములను జూపును.

వారివారి మతముల ననుసరించి భగవంతు నుపాసించుట ఉచితము. క్రైస్తవులు క్రీస్తు చూపిన మార్గమును, మహమ్మదీయులు మహమ్మదు నబీ నియమించిన పథమును, హిందువులు ఋషు లుపదేశించిన రీతిని అనుసరించుట శ్లాఘ్యము. ప్రతి మతమునందలి నిజమయిన భక్తులు అన్యమతస్థుల నెక్కువ యణకువతో గౌరవింతురు. అన్ని మతములు బ్రహ్మమునే చేర్పగలవు.

ఒక శతాబ్దము క్రిందట రామకృష్ణపరమహంస యీ ప్రకార ముపదేశించెను. ఈ యుపదేశము లే సుమారు రెండువేల సంవత్సరములకు పూర్వము రాతి స్తంభములపై చెక్కబడిన అశోకుని శాసనములలోను కానసగును. అందులో ఇట్లున్నది :

"దేవానాంప్రియునియొక్క శాసనము. ఏ మతము నకు చెందినవారైనను సరియే, సన్న్యాసులను, గృహస్థులను రాజు దానములచేతను, తదితరమార్గములందును బహూకరించి సంతోషపెట్టును. అన్ని మతములలోని మనుజులును తమ పారమార్థికశక్తిని వృద్ధిపఱచుకొనుట రాజునకు మిక్కిలి యానందదాయకము. పారమార్థికశక్తి ననేకమార్గముల నభివృద్ధి చేసికొననగును. అన్యమతములను గర్హించి స్వమతమును భూషించు దురభ్యాసమును విసర్జించుట, అవకాశము దొరకినపుడెల్ల అన్యమతములవారిని స్తుతించుట, గౌరవించుట, వీనికి పునాది. ఇట్లు చేయువాడు అన్యమతస్థుల కుపకారము కలిగించుటయే కాక తన మతముయొక్క ఔన్నత్యమునుకూడ పెంపొందించును. అటుగాక యితర మతములను దూషించి, ఆ మతస్థులను చిన్నతనము చేసినచో తన మతమునకే చెఱుపు చేకూర్చుకొనును. అన్యమతమును దూషించినంత మాత్రమున స్వమతముయొక్క మహత్త్వమును వృద్ధిచేయగలడా? ఎన్నడును కాదు. స్వమతముయొక్క మంచిపేరు చెడునుగాని వృద్ధి కానేరదు. ఆయా మతావలంబకులు స్వమత సిద్ధాంతములను చక్కగా

తెలిసికొని విధ్యుక్తసాధనలచే తమ భక్తిని పెంపుచేసికొన నగును. ఇది అశోకప్రియదర్శనుని అభీష్టమని అందఱును చాటుదురుగాక.''

కొన్నివేల సంవత్సరములకు పూర్వము భగవద్గీత లోని శ్రీ కృష్ణుని ఉపదేశము, తరువాత అశోకుని ద్వాదశ శిలాశాసనములలోని ఆనతి, గడచిన శతాబ్దములో శ్రీరామ కృష్ణపరమహంసయొక్క బోధ, మనకాలముననే జన్మించి పలువిషయములలో మనకు త్రోవజూపిన గాంధీమహాత్ముని యొక్క నియమములు — ఇవి యన్నియు ఒక్కటే, సమస్పష్టములే. వారు నియమించిన పథమును మనము చక్కగా బోధపఱచుకొని దృఢ విశ్వాసముతో అనుస రింతుము గాక!

ఇద్దఱు బాలురొక చెట్టుపై తాము చూచిన ఊసర వెల్లియొక్క వర్ణమును గుఱించి వివాదపడుచుండిరి. ''దాని వంక జాగ్రత్తగా జూడుము. అది యెఱ్ఱనిది. నీవు గ్రుడ్డి వానివలె అది పసుపుపచ్చ రంగుగలదియంటివి'' అని యొక డనెను.

''మూఢుడా! గ్రుడ్డివాడవు నీవు కాని నేను కాదు. అది పసుపుపచ్చగానున్నది. నీ వెఱ్ఱగా నున్నదంటివి'' అని రెండవవాడు బదులుచెప్పెను.

ఈ ప్రకారము వారి వివాదము తీవ్రమయ్యెను. ఆ తోటలోని ఒక గుడిసెలోనున్న ముసలమ్మయొద్దకు పంచా యతీ నిమిత్తము వారిరువురు వెళ్లిరి. ''మీరు దేనిని

గురించి తగవులాడుచున్నారు'' అని ఆ ముసలమ్మ యడిగెను. ''ఆ చెట్టువంక చూడుము. దానిపై నొక యెఱ్ఱని ఊసరవెల్లి గలదు. అది పసుపుపచ్చగా నున్నదని వీడనుచున్నాడు. పైగా నేను గ్రుడ్డివాడనని వెక్కిరించుచున్నాడు. నీవు దానివంకజూచి చెప్పుము. ఈ తెలివితక్కువవాడు నీవు చెప్పినదాని నొప్పుకొనును'' అని యెఱ్ఱగానున్నదని వాదించిన బాలుడనెను. ''అమ్మా! అవును, నీవే దానిని చూడుము. ఈ పెంకెవా డంధుడు. ఇది పసుపుపచ్చగా నున్నదని కనలేక యున్నాడు. అది యెఱ్ఱగా నున్నదని అతని భావము'' అని రెండవవాడు హెచ్చరించెను. ముసలమ్మ నవ్వి, ''మీ రిరువురు చెప్పినదియు సరియే. మీరు చెట్టుమీద చూచినది ఊసరవెల్లి. అది రంగులు మార్చుకొనగలదు. అది రంగులు మార్చుకొనగా నేను తఱచు చూచితిని. మీరు పోట్లాడక యింతట వెళ్లుడు'' అని చెప్పెను.

భక్తిగల దృష్టితో నీశ్వరుని చూచి ఆనందానుభవమునొందినవారి కత డనేక రూపములతో కనిపించును. భగవంతుని జూడక యుక్తితో మతమును గురించి వివాదము సల్పువారు అతని నిజస్వభావము నెన్నడు తెలిసికొనలేరు. వారు తమ యహంకారమునే తమ భగవంతునిగ తలంచుచు వృథాచర్చలతో కాలము వ్యర్థము చేయుదురు.

ఒక మఠాధిపతియొక్క సేవకులయొద్ద ముష్టియెత్తుకొనుటకు నలుగురు కబోదులు వెళ్లిరి. అచ్చట నొక యేనుగుండెను. వారు దానిని తమ చేతులతో తడవిరి. మావటివాడు

వారిని పరిహాసించుచు ఆ జంతువు దేనివలె నున్నదని యడిగెను. కాలు ముట్టుకొని యొక గ్రుడ్డివాడు "ఈ జంతువు ఒక స్తంభము వలె నున్న" దనెను. ఏనుగుయొక్క తొండమును మాత్రము స్పృశించిన రెండవవాడు "ఛీ ఛీ! అది యొక చెట్టు కొమ్మవలె నున్నది. అది స్తంభమువలె నున్నదని నీ వనెదవేమి?" అని బదులు చెప్పెను. "నీ వేమంటివి? ఇది యొక పీపావలె లేదా!" అని యేనుగు పొట్టమాత్రము ముట్టినవా డనెను. "మీా రెంత తెలివిగలిగి మాటలాడితిరి! ఇచట చేటవంటి యొక జంతువున్నది. మీారు దానిని పీపాతోను, కొమ్మతోను, స్తంభముతోను పోల్చితిరి. మీా రేల వదరుచున్నారు?" అని యేనుగు చెవిని తాకిన నాల్గవ వా డనెను.

మనోంధత్వము గలిగి దేవుని రూపమును గూర్చి వివాదపడువారు పై జెప్పిన రీతిగ సంకుచితబుద్ధి గలవారే.

## 3. సర్పమునొద్దకు జేరకుము

ఒకానొక సమయమున ఒక గొప్ప వర్తకుడు పరమహంస యొద్దకువచ్చి యిట్లు మనవిచేసెను. "మహానుభావా! నా సర్వస్వమును నా కుటుంబమున కిచ్చివేసితిని. నే నట్టి వ్యాపారమును చేయుటలేదు. అయినప్పటికిని భగవంతుడింకను నా యెదుట కనబడలేదు. దీనికి కారణమేమి? తన సొత్తు యావత్తు వదలివేసిన భగవంతుని జూడనగునని పెద్దలనియెదరు."

అందులకు రామకృష్ణుడు ఈ ప్రత్యుత్తర మిచ్చెను :
"పాతకుండలోని నూనె యావత్తు పారబోసినను అడుగున నింకను కొంత యంటుకొని యుండును. చాల కాలము నుండి కుండలో ఊరియున్న చమురును పారబోయుట కలవిగాదు. కుండ శుభ్రపఱచుటకు వీలులేదు. వాసన నిల్చియుండును. అటులనే ప్రపంచవాసన పోగొట్టుట సులభముకాదు. ఆస్తినంతయు నీవిచ్చివేసి యుండవచ్చును. అయినను నీ హృదయములో నాటుకొనియున్న ప్రపంచ వాసన సులభముగా వీడదు." మనకున్న సొత్తు యావత్తు ఇచ్చివేసిన మాత్రాన మనము సన్న్యాసులము కానేరము. ఆస్తి నిర్వహించుటలో కలిగెడు మనోవ్యథ లేకుండ హాయిగా నుండుట కొకవేళ తన యాస్తి నిచ్చివేసి యుండవచ్చును. కాని అర్థము, బంధుత్వము, కామము కల్పించు బంధముల నుండి విడివడి ఈశ్వరభక్తి జనితమైన జ్ఞానము బడయుట వేరువిషయము.

పరిపక్వ హృదయుడుగాక, సర్వము త్యజించిన వాని వలె పైకిమాత్రము నటించుచు, త్యజింపబడిన వస్తువులను గుఱించి సదా కలవరపడుచు, లోకాపవాదమునకు భయపడి కుత్సితవేషములను వేసినవాడు నిజమయిన త్యాగి కానేరడు. దీనికంటెను యోగ్యమైన గృహస్థ జీవనమే మేలు.

పాముల ఉపద్రవముగల గృహములో మనము ఆత్మ రక్షణకొఱకు జాగ్రత్తగ మెలగునట్లు కామలోభాది భూయిష్ఠమయిన యీ ప్రపంచమున జీవించునపుడు జాగ్రత్త

గలిగియుండవలెను. పుట్టబొరియనుండి తటాలున వెడలివచ్చి త్రాచుపాము కాటువేసి చంపునట్లు కామకాంచనముల యుద్రేకము త్రుటికాలములో మనుష్యునకు పతనము కలిగించును. మనమెంత మేధావంతులమైనను సర్వదా మెలకువ గలిగియుండవలెను. అనిశము హృదయమున భగవచ్చింతన సల్పవలెను. పూర్వకాలమున మన గ్రామములలో త్రాచుపామును ఇంటిలో జూచినవారు "అమ్మా! దేవీ! నీతోక ద్రిప్పి పడగ యెత్తక పొమ్ము" అను భావము గల మంత్రము నుచ్చరించుట మామూలు. అప్పుడు పాము వెళ్లిపోవును. హృదయములోని కామము నొక మహాసర్పముగా నెంచవలెను. దానితో చెలగాటము సల్పరాదు. దానికి దూరముగా నుండుట యుక్తము. "నేను వివేకిని, నే నెందులకు భయపడవలెను? దీనివలన నాకు గలుగు చెరుపేమి? నే నింతటితో నిలిచెదను. అది దాటిపోవును" అని తలంచుట అవివేకము. సర్పమును సమీపించిన అది తప్పక కఱచును.

ఒక ధనికుడు శ్రీరామకృష్ణుని యొద్దకు వెళ్లెను. "నేను మీ కొక పెద్దమొత్తమును సమర్పించుకొన బూనితిని. ఈ హుండీని తీసికొని మీ ఖర్చులకు వినియోగించుకొనవలెను" అని చెప్పెను. ఆ ధనికుడు సదుద్దేశముతోనే ఈ మనవి చేసెను. కాని శ్రీరామకృష్ణు డందుల కంగీకరింపలేదు. "వద్దు నీ ద్రవ్యమును స్వీకరించినట్లయిన నేను దానిని గురించి సదా చింతింపవలసి వచ్చును. నా మనస్సు ఆ

ధనమునందు చిక్కుకొని చలించును'' అని చెప్పి యతని ధనమును నిరాకరించెను.

''నేను దానపాత్రునికి సాహాయ్యముచేయ సమకట్టితిని. మీరు దీనికేల యభ్యంతరము కలిగించెదరు? మీరీ ధనము ముట్టనవసరము లేదు. మీకు సక్రమముగా పరిచర్యలు జరుగునట్లు చేయుట నా వాంఛ. ఈ ద్రవ్యమును మీ బంధువులలో నొకరిపేర నిల్వయుంచనిండు. దానికాక్షేప మేమిగలదు? తమరు దయచేసి యిందులకైనను సమ్మతింపవలెను'' అని యా ధనికుడు వదలక బదులు చెప్పెను.

అందులకు శ్రీరామకృష్ణుడు ఒప్పుకొనలేదు. ''నీ మొదటి పద్ధతికిని రెండవపద్ధతికిని భేదమేమి? సత్యమును మోసగింపనగునా? నీ సొమ్మును నేను స్వయముగ తీసికొనక నాకు బదులుగ మరియొకరు పుచ్చుకొనుటకు నీవు కోరిన రీతిగ సమ్మతించితి ననుకొందము. అపుడయినను 'అతడెంత సొమ్ము నీ యొద్దనుండి స్వీకరించెనో, యిప్పుడెంత నిల్వయున్నదో' అను మొదలగు ఆలోచనలు నా మనమున సంచరింపక యుండునా? అప్పుడు సర్వదా నే నాపైకమును గూర్చియే చింతన చేయక యుందునా? అటులకాదు. అట్టి ఏ యేర్పాటునకును నే నంగీకరింపను. నీ సొమ్ము నాకు సుతరాము వద్దు.''

ఇట్లు చెప్పినను ఆ ధనికుడింకను పట్టువదలలేదు. ''మీకెట్టి యభిలాషయులేదు. మీ హృదయము నీటిమీద

తేలెడు తైలమువంటిది. ధైర్యవంతులేల భయపడవలెను ధనము, స్త్రీ సౌందర్యము మొదలగునవి చుట్టు సముద్రము వలె పొరలి పొంగినను నిర్మలహృదయము జలముతో మిళితముగాని తైలమువలె దానిపై తేలునని మీరే స్పష్టముగా నుడివితిరి'' అనెను.

''ముక్తసంగుని హృదయము చమురువలె నీళ్లపై తేలును. అయినను చాలకాలము నీటితో కలిసియుండిన ఎంత మంచి తైలమయినను చెడి దుర్గంధముగల దగునని నీకు తెలియదా?'' అని నవ్వుచు శ్రీరామకృష్ణుడు బదులు చెప్పెను.

* * *

పరిశుద్ధ హృదయమునకు విశేష శక్తిగలదు. అది అన్ని ఉపద్రవములనుండి తప్పించుకొని కాపాడుకొనగలదు. అది సులభముగా వలలో చిక్కువడదు. అయినను చాల కాలము దురితముతో చెర్లాటమాడుట తగదు. మంచి వివేకముగల హృదయముకూడ నొకప్పుడు చలించును. తప్పుత్రోవలకు లాగు వాంఛితవస్తువులకు హృదయమును దూరముగా నుంచుట బుద్ధిమంతుని లక్షణము. తన్ను శోధించుకొనుటకైనను సరే యొక మనుజుడు వానిచెంతకు క్రమక్రమముగా చేరినచో నతడు పతనము చెందక తప్పడు.

## 4. చిత్తశుద్ధి

అందమైన యొక స్త్రీని మనము చూచినపుడు జగన్మాతయగు దేవిని ధ్యానింపవలెను. మన యెదుటనున్న

స్త్రీ జగన్మాత రూపములలో నొకటి యని జ్ఞప్తికి తెచ్చు కొని, "ప్రియమైన తల్లీ! నీవు మహాదేవి అవతార మూర్తివి. జగన్మాత యందముగా లేకుండ నితరముగా నుండ నగునా!" అనుచు ఆ తల్లి పాదములకు (మనసా) ప్రణమిల్ల వలెను. మన మనస్సును పసిబిడ్డ మనస్సువలె మార్చుకొన వలెను. పసిబిడ్డ తన తల్లిని చూచినపుడు దాని మనసులో వేఱు తలంపు జనించునా? ఈ మార్గమునే శ్రీరామకృష్ణుడు మొదటినుండియు అనుసరించెను. వివేకులు, విద్యావంతులు సైతము కామమునకు లోబడుదురు. ఈ యాపదనుండి తప్పించుకొనుటకు రామకృష్ణుడు మనకు చూపిన మంచి మార్గమిది.

స్త్రీ రూపమును మనము ద్వేషింపరాదు. స్త్రీలను మనము నిరసింపరాదు. ఆడువారు మోసము చేయువారని ఎన్నటికిని పలుకరాదు. తల్లిని ద్వేషింప వచ్చునా? ఆమెనుగూర్చి నిందావాక్యము లాడవచ్చునా? మనతల్లి మూర్తీభవించిన దేవియే. దేవి నీ తల్లి. ఆమె ప్రతి మనుజునకు తల్లి. ఆమె శక్తిస్వరూపిణి. ఆమె జగన్మాత. ఆమె సర్వవ్యాపిని అయిన పరబ్రహ్మమూర్తి. ఆమె సౌందర్యము, చిరునవ్వు మాతృమార్దవమును సూచించును. దేవికి ప్రణామము చేయుము. నీ కామము వీడును. రామకృష్ణ భగవాను డుపదేశించిన ఈ మార్గము నాచరింపుము. నీ మనస్సు క్రమాధిక నిర్మలత్వమును బొందుచున్నదని నీకు తత్క్షణమే గోచరమగును.

చట్టి, గరిటె వంటచేసి వడ్డించుకొనుటకు పనికి వచ్చునేగాని అవియే భోజనముగ నుపకరింపవు గదా! నీ కవసరములగు వస్తువుల జాబితా చదివిన మాత్రమున అవి చేకూరవు. స్వయంకృషి లేనిదే యుపదేశము వలన నెట్టి లాభము లేదు. భక్తిసాధనలదిశకు నీ మనస్సును మరలింపుము.

ఒక యందమైన నారీమణిని చూచినపుడు నీ మనస్సు చలించినచో నశోకవనములో నొక వృక్షము క్రింద తపస్సు చేసిన సీతాదేవిని తలచుకొనుము. నీవు రాక్షసకోటిలో చేరుదువా, లేక హనుమంతుని పాదములపైబడి నీలో దాగియుండు మనోదౌర్బల్యము నొప్పుకొని మాతయొక్క కృపనర్థింతువా? దేవి స్త్రీ రూపమున నీ ముందర నిలబడి నీ నిర్మలభక్తిని కోరును. మూఢునివలె కామవికారమునకు లోబడకుము. అసత్యమును జూచి సత్యమని భ్రమించి నాశమును తెచ్చుకొనకుము.

కీడుమేళ్లు రెండును మన మనస్సునందే పుట్టును. మనస్సునుండి జనించు తలంపులే బయట క్రియారూపమును దాల్చును. బాహ్యాకర్మయొక్కటే సర్వమనియు, నీ మనస్సునందేమి కలదో యది యితరులకు దెలియదనియు, నమ్మి నీ మనసు నొక బురదగుంటగా మారుచుండ నీయకుము. ఊరబావిలో కల్మషము చేరిన యెడల గ్రామములోని వారి యందఱి యారోగ్యము నిశ్చయముగా చెడునట్లు నీ మనస్సు బురదగుంటగా మారినయెడల నీ జీవితము

లోని విశిష్ట కర్మలన్నియు ఘోరపాప సమన్వితము లగును.

ఒకానొకప్పు డిద్దఱు మిత్రులు కులాసాగా నొక వీధిలో తిరుగుచుండిరి. ఒక గృహములో పురాణ కాలక్షేపము జరుగుచుండ భక్తకోటి వినుచుండుటను చూచిరి. "రమ్ము, మనముకూడ పోయి ఆ కథ విందము" అని తిరువేంగడమనెను. "హరికథ వినుట నా కిష్టము లేదు. దానివలన నేమి ప్రయోజనము! కల్పితకథలతో వారు తమ కాలము వ్యర్థపఱచుకొనుచున్నారు. వేశ్యావాటిక యొకటి గలదు. మన మచటికిబోయి అక్కడ ఈ రాత్రి సుఖముగా గడపవచ్చును. మన కష్టము లెప్పుడును ఉండును. మనము ఒకరోజైన ఆహ్లాదముగ గడపరాదా!" అని సాంబుడు బదులు చెప్పెను.

తిరువేంగడము సాంబునితో నేకీభవింపలేదు. "నాకు దానితో నవసరము లేదు. నీ కిష్టమున్న నీవు పొమ్ము. నే నిచట కూర్చుండి కథ వినియెద" ననెను. అంతటితో వారొకరినుండి మఱియొకరు వీడిపోయిరి. సాంబుడు వేశ్యల వీధికి వెళ్లెను. మతోపదేశములను వినువారి గోష్ఠిలో తిరువేంగడము కూర్చొనెను. భోగముదాని యింటికి పోయిన సాంబునకు ఎందులకో సంతృప్తి లేకపోయెను. "నే నిక్కడకువచ్చి యేల చిక్కుకొంటిని? నేనుకూడ పురాణము వినుటకు వెళ్లియుండిన యెడల బాగుండెడిదేమో" అని విచారపడెను. అచట నలుగురు చీట్లపేక లాడుచు సంతో

షముగా కబుర్లు చెప్పుకొనుచుండిరి. వారితో కలిసెను. కాని యతని మనస్సు అచట లేదు. హరికథ జరుగుచున్న స్థలమును తలపోయుచుండెను. ఇచట తిరువేంగడము పురాణము వినువారితో నున్నను అతని మనస్సుమాత్రము కథలో చేరలేదు. ఆ భాగవతుడు చక్కగా పాడలేదనియు, నతని గొంతు బొంగురు పోయినదనియు మాత్రము గమనించు చుండెను. కథ యతని నాకర్షింపలేదు. "సాంబుడిపు డేమి చేయుచుండునో, అతడిపుడెంత సంతోషముగా నుండునో, నేనుకూడ నతనితో వెళ్లియుండిన బాగుండెడిది." ఇట్లు తిరువేంగడము మనస్సంతయు సాంబునిమీదను, వేశ్యా గృహమున జరుగు 'జలసా' మీదను ఉండెను.

సాంబుడు వేశ్యాగృహమున నున్నను అతని మనస్సు పురాణము జరుగుస్థలము మీదనే యుండెను. "తిరువేంగడ మిప్పుడు ఎంత యానందముగ నుండునో! అతడు పుణ్యము సంపాదించుకొనుచుండగా నేనీ మూఢులమధ్య నున్నాను" అని చింతించుచు రాత్రిని గడపెను.

నిజమునకు తిరువేంగడము భక్తుల మధ్యనున్నను అతని మనస్సుమాత్రము నిర్మలినముగ లేకపోయెను. వేశ్యాగృహమునకు పోయిన పాప మతనిని చుట్టుకొనెను. వేశ్యాగృహమున నున్నను సాంబుని మనస్సు సత్సంగుల గోష్ఠిలో లగ్నమైనందున అతడు కొంతవఱకు పుణ్యము సంపాదించెను. భ్రష్టగృహమునకు బోయినను మనశ్శుద్ధి వలన అతడు కీడును తప్పించుకొనగలిగెను.

## 5. భ క్తి మా ర్గ ము

రామకృష్ణ భగవాను డొక శిష్యునితో నిట్లనెను : "నేను నీయెదుటలేనా? అయినను నా ముఖము నొకగుడ్డతో కప్పిన నీవు నన్ను చూడజాలవు. తత్క్షణమే నే నదృశ్యుడ నైనాను. కాని మామూలుగా నీ సమీపముననే యుందును. గుడ్డ తెరవలన నేను నీ కండ్లకు గోచరింపనైతిని. ఈ ప్రకారముగానే భగవంతుడు మన కందఱికిని చేరువనే యున్నాడు. అన్నివస్తువులకంటెను అతడు మనకు మిక్కిలి సమీపముననే యున్నాడు. కాని అహంకారమను ("నేను" అను) తెర యతనిని కప్పివేయును. నీ కన్నుల ముందొక చిన్నగుడ్డ నుంచుకొనిన పెద్దపర్వతముకూడ నీదృష్టికి గోచరముకాదు. అహంభావము, గర్వము అను తెర మనముందు నిలుపుకొనియున్నంతవఱకు మనము భగవంతుని చూడజాలము. "నేను" అనునది యంతరించిన భగవంతుడు తత్క్షణమే పూర్ణప్రకాశముతో గోచరించును.

ఈశ్వరకటాక్షము ప్రాప్తించినవానికి, అతడు చేయు కర్మయంతయు ఈశ్వర ప్రేరితమనియు, ప్రపంచములో జరుగునదంతయు నద్భుత నటుడైన ఈశ్వరుని లీలయనియు తెలిసిపోవును. ఇది తెలిసికొనినపు డతడు జీవన్ముక్తుడగును. అనగా ఈ శరీరముతో నుండగనే ముక్తిని బడయును. అట్టివానికి భయదుఃఖములు లేవు.

నిజమైన భక్తుడు తఱచుగ నీరీతి మననము చేయును.

యీశ్వరా! యిది యంతయు నడపించునది నీవే. నేను

చేయగలదేమియు లేదు. నేను నీ చేతులలోని కీలుబొమ్మను. నేను చేయు కర్మలకు నీవే కారకుడవు. అంతయు నీ మహిమయే. నే నేదైన మంచి యొనర్చిన, అది నీ మహాత్మ్యము ననే. ఈ యిల్లు, కుటుంబము నాయవికావు. అవన్నియు నీవియే. నేను నీ యిచ్ఛానువర్తినైన సేవకుడను. నీ యాజ్ఞ నెఱవేర్చి నీ సేవచేయుట నా హక్కు, నా యానందము.''

ఈ రీతిగ సర్వదా స్మరించుచు నిజమయిన భక్తితో జీవితము సల్పితిమేని ''నేను'' అను తెర తొలగిపోవును. ఒక యద్భుత దృశ్యము గోచరమగును.

ఈ ''నేను'' అనునది రెండు విధములుగ నుండును. ఒకటి పరిపక్వమైన భక్తివలన కలిగినది. పక్వముకాని యహంకారము రెండవది. 'నా యిల్లు, నా బిడ్డ, నా భార్య, నా శరీరము, నా యాస్తి' యని తలంచుట పరిపక్వముకాని యహంకారమే. ఇది దేవుని మఱుగుపఱచు తెర. భక్తుడు 'నే నీశ్వర సేవ చేయువాడను. ఈ సర్వము నతనిదే. నే నతని దాసుడను. అతని సేవచేయుట నాకు పరమానందము' అని జ్ఞప్తియుంచుకొనుచు జీవయాత్ర సల్పును. ఇట్టి ప్రవర్తనచే గర్వము పండి రాలిపోవును. భక్తుడు జీవన్ముక్తుడగును.

అయితే ''నేను'' అనుభావమును త్యజించుట అంత సులభముకాదు. బుద్ధికుశలత, అద్వైతముయొక్క జ్ఞానము కలిగియుండుట మాత్రము చాలదు. మానవుడు పూర్తిగా దేవుని భృత్యుడై మారి యా మార్గముననే మెలగవలెను. 'నేను భక్తుడను' అను భావములోని ''అహము'' దోష

యుక్తమయినదికాదు. పసివాని యహంకారమువలె అది నిర్దోషమయినది. అపక్వమయిన "నేను" అను నహంకారము నశింపవలెను. భక్తునియొక్క "నేను" అను భావమతని నీశ్వర సన్నిధి జేర్చును. భక్తిమార్గమున నడచు మానవుని హృదయములో కొంచె మహంకారమున్నను అది ఈశ్వరసేవకరూపముదాల్చియే యుండును. దానివలన తప్పులేదు. భక్తిమార్గము మిక్కిలి గొప్పది.

*　　　　*　　　　*

ఎంత కడిగినను వెల్లుల్లి నుంచు పాత్రలోని వాసన పోదు. అట్లే యహంకారముకూడ. అది దుర్లక్షణము. ఇతరులు దానిని విడువగలిగియుండవచ్చును, విడువలేకపోవచ్చును; కాని, ఏకాంతమున నుండు వానికది బహుకష్టము. అహంకారమును నెమ్మదిగా భక్తిమార్గములోనికి దింపి, పట్టుదలతో సరిపఱచుచుండిన, అది పరిపక్వమై రాలి యదృశ్యమగును.

*　　　　*　　　　*

వైద్యశాస్త్రవిశారదు డొకడు జబ్బుతో నున్నరొక శిశువును జూచుటకు వచ్చి 'ఆతురపడకుము. నే నీ బిడరొయొక్క రోగమును మాన్పెదను. ఈ బిడ్డ ప్రాణమును కాపాడు బాధ్యత నాది' యని తల్లికి చెప్పెను.

"వైద్యులు ఈ రీతిగ మాటలాడునపుడు దైవము నవ్వును" అని శ్రీ రామకృష్ణుడు నుడివెను. ప్రాణమునకు

నిజమయిన సంరక్షకుడు, అధికారి భగవంతుడు కాని వైద్యుడు కాడు. అది ఈశ్వరుని చేతిలోనిది.

ఇరువురు సోదరులు తాము సమష్టికుటుంబముగా నుండుటకిక వీలుపడదని నిశ్చయించి భూముల పంపకమునకు సిద్ధపడిరి. జ్యేష్ఠుడొక పగ్గము తీసికొని భూములను కొలత వేసి "యిది నీది, అది నాది" యని సోదరునకు చెప్పెను. తనభూమి నిట్లు పంచుకొను మూఢులగాంచి ఈశ్వరుడు నవ్వునని శ్రీరామకృష్ణుడు పలికెను. తానే స్వాతంత్ర్యము లేని క్షణికజీవుడై యున్నప్పుడు "ఇది నాది" యని చెప్పిన భగవంతుడు నవ్వక యేమిచేయును?

పెక్కుసంవత్సరములకు పూర్వము పాశ్చాత్యదేశము నందొక యువకుడైన క్రైస్తవ సన్న్యాసియుండెను. అతడు మఠములోనుండి యితరసన్న్యాసులకు వంటచేయుచును పలు విధములగు సేవలొనర్చుచును కాలము గడుపుచుండెను. అత డెక్కువ విద్య నేర్చినవాడు కాడు. వయసులో చిన్నయయి నను అతడు నిర్మల హృదయుడైన భక్తుడు. వంటచేయుట, బట్టల నుదుకుట, కుండలు కడుగుట మొదలుగాగల యే పనులుచేసినను అది భగవత్సేవగా మనసులో నెంచి చేసెను. ప్రార్థనచేయుటకు, ధ్యానముచేయుటకు, కూడ నతనికి స్థలము గాని వ్యవధిగాని లేదు. ఎచ్చట నే పని చేసినను భగవంతుడు తనప్రక్కనే యెల్లపుడున్నట్లు ఎంచెను. దేవుడతనికి విడువని చెలికాడాయెను. సర్వదా భగవంతుడు తనతో విడువకయుండి, తనతో పాటు నిద్రించుచు, తనతో నాడుచు,

పని చేయుచుండుటను తాను చూచెను. అతని నిరంతర సమర్పితబుద్ధి, అవిచ్ఛిన్నానందము ఇతర సన్న్యాసులకు ఆశ్చర్యము పుట్టించెను. లాటెన్నుసహోదరుని గుఱించిన యీ విషయమును మనము చదివినపుడు బృందావనము లోని గోపికల కథయు, శ్రీ రామకృష్ణుని జీవితమును, మనకు తప్పక జ్ఞప్తికి వచ్చును. ముఖాముఖి పరమాత్ముని సందర్శించిన మహాత్ములు, జీవన్ముక్తులు, ప్రతి దేశములోను ప్రతియుగములోను కలరు.

## 6. రాజు, భాగవతుడు

శాస్త్రములను, పురాణములను, సాంగోపాంగముగా నేర్చిన యొక బ్రాహ్మణు డొక రాజునొద్దకువెళ్ళి రాజ మందిరములో పురాణము చదివి యర్థము చెప్పనిచ్చగలదని వేడెను. "మహారాజా! భాగవతము ఉత్కృష్టమయిన ధర్మ శాస్త్రము. గురుముఖతః తమరు అది నేర్చుకొనుట ఆవ శ్యకము. తమ యాజ్ఞయయిన నేను తమకు దానిని విశద పఱచెదను. ధర్మశాస్త్ర కోవిదుడయిన పండితుడని నన్ను విద్వాంసులు పరిగణింతురు. నగరులో భాగవతమును విశ దీకరింప నాకు గొప్పయాశ. పండితుల సత్కరించుట రాజ ధర్మము" అని బ్రాహ్మణుడు విన్నవించెను.

రాజు ఎక్కువ ప్రపంచజ్ఞానముగల మంచి గడుసరి. అతడు తనలో నిట్లు తర్కించుకొనెను: "భాగవతము చదివి యందలి వాస్తవార్థమును తెలిసికొన్నవాడైనచో నితడు

ధ్యానము, తపస్సు చేయుచు నుండవలెను. యశస్సు,ధనము సంపాదింపగోరి రాజులదయ వెదకుచు రాజగృహములకు రాడు." రాజు బ్రాహ్మణు నుద్దేశించి యిట్లు పల్కెను. "ఓ విద్వాంసుడా! తమరిని గురువుగా స్వీకరించి తమ ముఖతః భాగవతశ్రవణము జేయ నాకును కుతూహలము కలదు. అందుచే మీరు ఆ గ్రంథమును మఱల నొకటి రెండు మారులు చదివి తరువాత రండు."

రాజు మాటలను వినినయంతనే పండితునకు కొంత యాగ్రహము కలిగెను. కాని, రాజుపై నాగ్రహించిన ప్రయోజనమేమి? కావున మారుమాటలాడక యింటికి వెళ్లెను. ఇంటికి నడచిపోవుచు విచారముతో తనలోతానిట్లు తలపోసెను. "ఈ రాజు వట్టి మూర్ఖుడు. పండితుని గుర్తింపజాలడు. భాగవతము మరల చదివినతరువాత తన యొద్దకు తిరిగి రమ్మనెను. ఈ శాస్త్రములు చదువుటలో పంద్రెండు సంవత్సరములు గడపితిని. భాగవతమంతయు నాకు కంఠతః వచ్చును. ఈ రాజు తిరిగి నన్ను చదువు మనెను."

జరిగిన యుదంతమునంతయు ఇంటికివచ్చి తన భార్యకు చెప్పెను. "ఎంతయైనను అతడు రాజు. అతని యాజ్ఞప్రకారము సల్పుడు. భాగవతము మఱల నొకమాఱు చదివి యతని సన్నిధికి వెళ్లి 'తమ యాజ్ఞానుసారముగ చేసితి' నని చెప్పుడు. రాజు నెట్లయినను మెప్పించి ఆస్థానపౌరాణిక పదవిని మీరు సంపాదించితిరేని, మన అదృష్టము పండును.

అనేకవిధములయిన లాభములను పొందవచ్చును" అని అతని భార్య చెప్పెను.

ఆ బ్రాహ్మణుడు తన కోపమును చంపుకొని తన భార్యయొక్క సలహాప్రకారము మఱల భాగవతమును బహు జాగరూకతతో పఠించెను. ఆ గ్రంథమును గుఱించి యే ప్రశ్న వేసినను జవాబు చెప్పుటకు అతడిప్పుడు శక్తి కలిగియుండెను. ఒక సుముహూర్తమున రాజభవనమునకు మఱల వెళ్లెను. చాల మర్యాదగా బ్రాహ్మణునికి స్వాగత మిచ్చి "భాగవతము మఱల జదివితిరా?" యని రాజు ప్రశ్నింపగా బ్రాహ్మణు డిట్లు బదులు చెప్పెను. "మహా రాజా! తమ యాజ్ఞ ననుసరించి ఆపురాణమును మఱల పలు మాఱులు చదివి యిచటకు వచ్చితిని. తమ సన్నిధానమున భాగవతమును వ్యాఖ్యానముచేసి తమ కీర్తిని, ధర్మబుద్ధిని ఇనుమడింప జేయవలయుననియే నా వాంఛ."

"ఓ పండితుడా! నేను నీ శిష్యుడనై భాగవతము నేర్చికొనెదనని నమ్మము. అయితే నీ విపు డింటికివెళ్లి యా గ్రంథమును మఱల నొకమాఱు చదివిరమ్ము" అని రాజ నెను. మఱల నీ ప్రకారము జరిగినందుల కాశాభంగము పొందినవాడై బ్రాహ్మణు డింటికిజని జరిగిన వృత్తాంతమును తన భార్యకు జెప్పెను.

"ఇందులో నేదో రహస్యమున్నది. రాజు చెప్పినట్లు మఱల జదువుడు. ఏమగునో చూచెదము" అని భార్య పలికెను. మిక్కిలి పూనికతో ఆ పండితుడు మఱల నా గ్రంథ

మును జదువ నారంభించెను. ఈమారు ఆశాభంగము కారాదని నిశ్చయించి యేకాంత స్థలముననున్న ఒక ఆశ్రమము నకు వెళ్లి యెక్కువ దీక్షతోను, శ్రద్ధతోను గ్రంథమును పఠించెను. ఆ గ్రంథమునం దీమా ఱతనికి నూతనభావములు స్ఫురించెను. పురుషోత్తముని యవతారమహిమ అతని హృదయమును అనివార్యశక్తితో నాకర్షించెను. సరియైన వేళకు భోజనముచేయుట కూడ మఱచెను. మునుపెన్నడును కనని యపూర్వసత్యములు భాగవతములో నతనికి గోచరించెను. ఇంటికిపోవుట సైతము మఱచి ఆశ్రమముననే కాలము గడపెను.

కీర్తి, ధనము, గౌరవము తుచ్ఛములని తెలిసికొనెను. పిదప భాగవతము చదువుటకూడ మానెను. ధ్యానములో నిమగ్నుడై రాజమందిరమునకు పోవలయునను తలంపు వీడెను.

అతడిట్లు కుటుంబవిచారములను గమనింపక తపోధ్యానములలో నిమగ్నుడై కాలము గడుపుటచూచి యతని భార్య చాల విచారపడెను. ఏదియో ప్రారంభించి యిట్లు విపరీతముగా తేలినదని దుఃఖపడి యేమియు తోచకుండగ రాజునొద్దకు వెళ్లి తన కష్టములను మనవిచేసికొనుటకు భర్త యొక్క సెలవు నర్థించెను. రాజు జరిగిన వృత్తాంతము నామె మూలమున తెలిసికొని చాల సంతోషించి యా విద్వాంసుని చూచుటకు తనంతటతానే బయలుదేరెను. రాజు ఆశ్రమము చేరినపు డా బ్రాహ్మణుని ముఖములో నొక

నూతన ప్రకాశమును గాంచెను. బ్రహ్మజ్ఞాన మతని ముఖమునం దెక్కువ కాంతిగలిగి ప్రకాశించెను.

రాజు బ్రాహ్మణుని పాదములమీఁదపడి "నీ వీశ్వర కటాక్షమును పొందితివి. నీకు ప్రణామము చేయుచున్నాను. నా యపచారమును క్షమింపు" మని వేఁడెను.

పుస్తకజ్ఞానము, శుష్కపాండిత్యము వేఱు; సత్యజ్ఞానము వేఱు. ఈ సత్యజ్ఞానము భక్తిమూలమునమాత్రమే లభించును,

## 7. స్త్రీత్వము—మాతృత్వము

స్త్రీలనందఱిని దేవ్యంశముగనే రామకృష్ణ భగవానుడు నిరంతరము భావించుచుండెను. దేవి వివిధాంశములతో, వివిధస్త్రీరూపములతో దర్శనమిచ్చుచుండును. నీవు చూచెడి స్త్రీలట్టివారే. నీవు వారిలో నెవరినైనను జూచినపుడు దేవియొక్క యాలయములోనికి జనువానివలె నీ మనస్సును భక్తిపూరితముగ జేసికొని, దేవి యా స్త్రీరూపమున నీకు దర్శనమిచ్చుచున్నదని భావింపవలెను. మంచివారయినను చెడ్డవారయినను స్త్రీలనందఱను దేవీరూపములుగ భావించి (మానసికముగ) ప్రణమిల్లుచుండుము. వారిని దూషించుటకుగాని, భూషించుటకుగాని నీకు నాకు హక్కులేదు. ప్రపంచమునకు కారణభూతమయిన దేవియొక్క విశ్వలీలను మనము తెలిసికొనగలమా! ఆమెయాజ్ఞ శిరసావహించుట మనధర్మము. స్త్రీలందఱు దేవీరూపములే.

ఆలయములో అలంకరింపబడిన దేవీ విగ్రహమునకు నీవు ప్రణమిల్లుదువు గదా! ఈ స్త్రీలందఱును ఆ దేవియొక్క సజీవవిగ్రహములే. కావున వీరికికూడ నమస్కరింపుము.

"గురుదేవా! స్త్రీలయెడల నే ప్రకారముగా నడచుకొనవలె"నని పరమహంస శిష్యుడొకడు ఆయనను ప్రశ్నించెను.

"ఈశ్వరకృపచే నతనిని దర్శించినవానికి స్త్రీలవలని భయముండ నవసరములేదు. తనకు కనబడు స్త్రీలనందరిని అతడు జగన్మాతృబింబములుగా నెంచును; విశ్వరూపమును ధరించిన దేవియే పలుస్త్రీలుగా మారి కనుపించుననని స్త్రీలనందఱను పూజించును. కన్నతల్లిని భక్తిప్రేమలతో అర్చించునట్లు వారినందరిని అర్చించును."

"గురుదేవా! కామవికారము నెట్లు జయింపగలము? ఆ మార్గము నాకు సెలవిండు."

"నీవు చూచు ప్రతిస్త్రీని నీ తల్లిగానే భావింపుము. ఆమె పాదములకు దండప్రణామము లాచరింపుము. అపుడు నీ మనస్సులోని దుష్టభావములు వీడిపోవును."

*　　　*　　　*

"వివాహితలై తమ భర్తలతో కాపురముచేయుచున్నను కొందఱుస్త్రీలు తమ కన్యాత్వమునే కాపాడుకొనుచుందురు. అట్టివారు దేవియొక్క ప్రత్యక్షమూర్తులే."

"కొందఱు (పురుషులు) తాంత్రికమార్గానుసరణి భక్తురాండ్రగు స్త్రీలతో కలసి దేవిని ఉపాసింతురు. ఇది

తమ రామోదింతురా!'' యని యొక శిష్యుడు శ్రీరామకృష్ణు నడిగెను.

వంగదేశములోను, మరికొన్ని యితర ప్రదేశములలోను కొందఱు శక్తిపూజావిధానమును ఆచరింతురు. వారిలోను దుష్టులు కలరు. శిష్యుడడిగిన ప్రశ్న వీరిని గుఱించియే. శ్రీరామకృష్ణుడు ఇటుల హెచ్చరించెను:

''ఇది యపాయకరమయిన మార్గము. సామాన్యజనులు దీని ననుసరింపదగదు. ఈ దుర్గమమార్గము ననుసరించువారు పాపములో కూలు నవకాశము కలదు. స్త్రీని శక్తిగా భావించి యామెకు పూజచేయుట తాంత్రిక పూజావిధానములోని భాగము. ఇది మూడు విధములుగా చేయనగును. భక్తుడు తన్ను కుమారునిగ భావించుకొనుట యొక మార్గము. తల్లిని కుమారుడు ప్రేమించి పూజించు రీతి నతడామె నుపాసించును. తా నామెకు సఖగనో, సహచారిణిగనో భావించుకొని పూజించుట రెండవది. ఈ రెంటిలో మాతృభావముతో నుపాసించుట—ఆ భావముననే సుస్థిరముగ నిలిచి అందే నిమగ్నుడై పోవుట—ఉత్తమమార్గము. తన్ను ఆమెయొక్క సఖగా భావించుకొని కొల్చుటయు మంచిదియే. మూడవ మార్గముకూడ కలదు. అది నాయికానాయక భావము. ఇది యెక్కువ అపాయకరమయిన పద్ధతి. దాని ననుసరింపగూడదు.''

దేవాలయములో విగ్రహమును పూజించునటుల సజీవయగు స్త్రీని దేవిగ భావించి రహస్యముగ సేవించు

పద్ధతి యొకటి తాంత్రికశాస్త్రములో గలదు. పరమహంస దీనిని నిషేధించెను. స్వానుభవమునుగూర్చి మాటలాడుచు నిటులు ఆయన నుడివెను. "తాంత్రికపూజావిధానములను నేను రెండు సంవత్సరముల కాల మభ్యసించితిని. సఖినిగాను బిడ్డనుగాను భావించుకొని అభ్యసించితిని. బిడ్డతల్లులభావము ఈ రెంటిలో నా కెక్కువ అనుకూలముగ కనుపించినది. దేవిని నా భార్యగా నెంచి నే నెపుడును కొలువలేదు. అది కష్టమయిన మార్గము. నేను దానిని పూర్తిగా నిషేధించు చున్నాను."

"గృహస్థమార్గమున మీరును, మీ భార్యయును ఏల కాపురము చేయరు?" అని భగవానుని ఒకరు ప్రశ్నించిరి. దానికి ప్రత్యుత్తరముగా ఆయన ఒక కథ నిట్లు చెప్పెను.

"పరమశివుని పుత్రుడయిన గణేశ్వరు డొకనాడొక పిల్లిని తన గోళ్లతో జీరెను. తరువాత నింటికి వెళ్లి తన తల్లి బుగ్గమీద గీరలను జూచి, 'ఈ గీర లెట్లు వచ్చినవి, నిన్నీరీతి గీరిన దెవరు?' అని యడిగెను. 'నాయనా! ఇది నీవు చేసినదే. నీ గోళ్లతో నీవు నా ముఖమును గీరితివి' అని పార్వతీదేవి బదులుచెప్పెను. 'తల్లీ! ఇది యెట్లు, నే నెప్పుడు గీరితిని?' అని గణేశ్వరు డడిగెను. 'ముద్దుబిడ్డా! పిల్లికి చేసినపని మఱచితివా?' యని గౌరి అనెను. 'నేను పిల్లిని గీరితిని నిజమే. ఆ గీరలు నీ బుగ్గమీద కెట్లు వచ్చినవి?' అని గణేశ్వరు డడిగెను. 'నాయనా!

ప్రపంచమంతయు నా శరీరమే. నీకు తెలియదా? ప్రాణి కోటిలో దేనినైన నొకడు నొప్పించెనేని నన్ను నొప్పించి నట్లే.' ఇది జరిగిన పిమ్మట గణేశ్వరు డెవరిని పెండ్లిచేసి కొనుట కొప్పుకొనలేదు. అతడు చూచిన ప్రతిస్త్రీయు నత నికి తల్లిగా కనబడెను. స్త్రీజాతి యతనికి జగన్మాతగా తోచినందున పెండ్లి విషయము నతడు తలపెట్టలేదు. అదే రీతిగ నా కండ్లకుకూడ ప్రతిస్త్రీ పార్వతీదేవిగనే కనపడును. నే నేమి చేయగలను?'' అని పరమహంస నుడివెను.

## 8. మూగవారు సహితము మాటలాడుదురు

శ్రీ రామకృష్ణుడు దక్షిణేశ్వరాలయములో నుండగా ఒక దినమున బ్రాహ్మసమాజాచార్యులలో నొకరగు కేశవ చంద్రసేను ఆయనను దర్శింపవచ్చెను.

''ఎందుచేత నెక్కువ చదువుకొనిన విద్వాంసులు కూడ నొకప్పుడు మూర్ఖులుగా ప్రవర్తించెదరు? శాస్త్రము లలో నెక్కువ పాండిత్యమున్నను వారికి విజ్ఞానము లేనట్లు తోచును. ఆశల నంటుకొని సుఖములలో పొరలాడెదరు. ఇది యాశ్చర్యముగా నున్నది'' అని కేశవచంద్రు డడిగెను.

''రాబందు లాకాశమున నెగురును. ఆకాశవీథి యందు పరిశుభ్రములును, అత్యున్నతములును అగు క్షేత్ర ముల అవి విహరించుచుండినను నేలమీది శవములు, మాంసము, బొమికలమీదనే వాని దృష్టి లగ్నమై యుండును'' అని రామకృష్ణపరమహంస బదులు పలికెను.

వేదవాక్యములు చదువునపుడు సైతము మనము కామించు వస్తువులయందే మనసు సంచరించుచుండుటకు మొదలిడును. పాండిత్యము వేరు, మన మాశించు విషయములు వేరు. మనము శాస్త్రపఠనముచే జ్ఞానము సంపాదించుకొనుటకై చేయు ప్రయత్నములు మన ఆశలవలనను, అనురాగములవలనను అంతరాయము పొందుచుండును. పాండిత్యముమాత్రమే చాలదు. భాషా ప్రావీణ్యముండవచ్చును; మంచి శ్లోకములను అప్పజెప్పవచ్చును; మంత్రములు సస్వరముగా జదువవచ్చును. అంతమట్టుకే పాండిత్యఫలము. మనము వాంఛించు విషయములే మనలను బాగుచేయును, లేదా పతనము గావించును. కామినీకాంచనాది విషయాసక్తి యుండునంతవఱకు పుస్తకముల ద్వారా నేర్చిన విద్యవలన మనకు జ్ఞానముగాని, ముక్తిగాని చేకూరదు. నిపుణములయిన యుపన్యాసముల నిచ్చుటకు విద్య తోడ్పడవచ్చును. బ్రహ్మము, పరాత్పరుడు, జ్ఞానయోగము, భక్తియోగము, మూలప్రకృతి, జీవాత్మ, పరమాత్మలు ఇట్టివానిని గుఱించి మాటలాడి శ్రోతలను అద్భుతావహులను జేయవచ్చును. కాని, ఆ ప్రసంగము నాలుక చివరనుండిమాత్రమే బయలుదేరును. హృదయమునుండి రాదు. హృదయములో జొచ్చి మనస్సు నీశ్వరునివైపు మఱల్చినప్పుడే మన పాండిత్యము ఫలితమగును. అటులకాదేని శాస్త్రములు, పురాణములు మనకు నిష్ప్రయోజనములు.

స, రి, గ, మ, ప, ధ, ని, యను సంగీత స్వరాక్షరములు మనముచ్చరింపవచ్చును. కాని, ప్రత్యేకమయిన స్వరములు సంగీతము కావు. మాటలు సక్రమముగా పొదిగి జ్ఞానమును గూర్చియు, వైరాగ్యమును గూర్చియు ఉపన్యాసమిచ్చుట సులభమే. కాని, నిజమైన జ్ఞానము, నిష్ఠురమైన వైరాగ్యముగల జీవితము నడుపుట వేరు విషయము. అది కష్టతరమైన కార్యము.

ఫలాని రోజున నింత వర్షము కురియునని పంచాంగములో వ్రాయబడియుండును. అట్లే జరుగవచ్చును కూడ. కాని పంచాంగముయొక్క కాగితములను మనము చేతులతో గట్టిగా పిండినను వర్షపునీరు లభింపదు. నీ వెంత గట్టిగా పిండినను ఒకచుక్క నీరైనను రాదు. శాస్త్రములలో గొప్ప విషయము లనేకములు మనకు గోచరమగును. కాని, వానిని పఠించినంతమాత్రమున మనకు భక్తి సమకూరదు. వానిలో నియమించిన రీతిగ ఆశలను నిగ్రహించిన భక్తి జనించును.

విద్య, తెలివి వీనివలన దేవుని సమక్షమందేమి ప్రయోజనము? అచట మూగవారు సైతము మాటలాడుదురు, అంధులుకూడ చూతురు. చదివినవారును, చదువనివారును దేవుని యెదుట సమానులు.

'గంజాయి, గంజాయి' యని నూఱుమాఱులు కేకలంవేసినను మత్తు కలుగదు. కొంచెము గంజాయి చేతులలో తీసికొని, నలిపి, నీళ్లలో కలిపి, త్రాగినప్పుడే మత్తె

క్కను. మనసు భగవంతునివైపు మరలింపక యతని నామములు వేయిమాఱులు జపించినను ప్రయోజనముండదు. మనసును నిల్పి తదేకనిష్ఠతో ధ్యానముచేయవలెను. అప్పుడే పరమాత్మను చూడనగును.

ఒక పటములో వారణాసిని సూచించు చుక్కను చూచి "నేను వారణాసిని జూచితి"ననువాడు శాస్త్రములను జదివి పలువురతో బ్రహ్మమును గుఱించి వర్ణించు వానివంటివాడు. ఒక పటములో నగరములు, నదులు, కొండలు సక్రమముగా సూచింపబడియుండును. కాని, పటములో వానిని జూచుట నిజముగా వానిని జూచినట్లు కాదు. ఒకప్పుడు దారపుఉండ చిక్కుపడును. చిక్కుతీసినగాని మనము దాని నుపయోగింపలేము. అదేప్రకారముగ గ్రంథములలోని యంశములు హృదయగ్రంథులుగా పరిణమించును. మంచితనము, భక్తి, ధ్యానము ఉండినగాని వాని చిక్కులోనుండి బయటపడజాలము. అణకువ, భక్తి, యీశ్వరకటాక్షము లేనిదే పుస్తకము లెన్ని చదివినను అట్టివానిస్వభావములోని దుష్టత్వమే పెంపొందును. వాని చదువు అహంకారమును హెచ్చుచేసి మనస్సులో జ్ఞానోదయము కలుగకుండుటకు మాత్ర ముపయోగపడును.

అహంకారము భస్మరాశివంటిది. దానిమీదపోసిన నీరంతయు దానిలో ఇంకిపోయి ఊరకుండును. ఈశ్వరభక్తితో కరగినను అహంకారము పీడిపోదు. నేర్చియున్న సంస్కృతము, చేయువిచారమంతయు, భస్మరాశిమీదపోసిన

3

నీటివలె వ్యర్థమగును. శాస్త్రగ్రంథములు భగవంతుని చేరుమార్గమును మాత్రము చూపించును. నీతి, భక్తి, ధ్యానము లేనిదే అవి భగవంతుని జేరుటకు సహాయపడవు.

మనము కొనదలచిన వస్తువుల జాబితా నొకటి తీసి కొని దుకాణమునకు పోదుము. మనము కొనదలచిన వస్తువులు తెలిసికొనిన పిదప జాబితా యెందులకు నుపయోగపడదు. దేవుని చేరుమార్గమును శాస్త్రములు నుడువును. మార్గము తెలిసిన పిదప, ఆ మార్గము నవలంబించుటయే మనవిధి. మన కవసరమయిన వస్తువుల జాబితాను గురించి తలచినంతనే ఆ వస్తువులు సమకూరవు. ఒక పట్టణమునకు పోవలెనన్నచో దానిని చేర్చుమార్గమును తెలిసికొనుటయే గాక, ఆ మార్గమువెంట నడువవలెను. మార్గము తెలిసి కొనుట మాత్రము చాలదు. ఆ మార్గమువెంట నడచిననే మనము పట్టణము చేరగలము.

శ్రీ చైతన్యులు దక్షిణదేశయాత్ర సల్పునపుడు గీతనుగుఱించి యుపన్యసించు నొక పండితుని గనెను. గీతలో నొక శ్లోకమునకైన అర్థము తెలియనిభక్తుడొకడా శ్రోతలలో నుండెను. అయినను ఉపన్యాసము జరుగునంత వఱకు అతని కన్నులనుండి ధారగా నీళ్లు కారుచుండెను.

"నాయనా! నీవేల యేడ్చెదవు? నీకేమి బాధ?" అని చైతన్యప్రభువు వానిని ప్రశ్నించెను. "రథముపై కృష్ణార్జునులు కనబడుచున్నారు. వారిని జూచినంతనే నా న్నులనుండి బాష్పములు జారుచున్నవి. ఉపన్యాసము

లోని యొక పలుకయినను నావీనులలో చొరలేదు" అని భక్తుడు బదులు పలికెను.

ఈ విద్యలేనిభక్తుడు నిజమైన జ్ఞాని. ఇట్టి తీవ్రభగవద్భక్తిని కలిగించుటే సర్వశాస్త్రములయొక్క ఉద్దేశమును, భావమును.

## 9. సన్న్యాసియొక్క కథ

ఒక దేవాలయముదగ్గఱ నొక గృహములో నొక సన్న్యాసి నివసించుచుండెను. ఎదురింటిలో నొక వేశ్య యుండెను. ఆమె యింటికి ప్రతిదినము మనుష్యులు వచ్చుచు పోవుచు నుండుటను అతడు చూచెను. అంతమంది పాపవర్తనులై యుండుట జూచి అతడు దుఃఖపూరితుడయ్యెను. అంత నొకనా డతడు ఆమెను పిలిచి యిట్లు మందలించెను: "ఓసి పాపాత్మురాలా! రాత్రింబగళ్లు నీవీరీతిని పాపపు జీవనము చేయుచున్నావు. మరణమాసన్నమయినపుడు నీ వేమి చేయుదువు?"

ఈ మాటలామె మనసున నాటెను. ఆమె తన దురవస్థను గుఱించి దుఃఖించి, ఈశ్వరు నిట్లు ప్రార్థింప మొదలిడెను: "ఓ దైవమా! నా పాపములనుండి నన్ను రక్షింపుము." ఇట్లామె మనోవేదనతో ప్రతినిత్యము దేవుని ప్రార్థించుచుండెను. కాని జీవనోపాధి కామెకు వేఱొక మార్గము లేకపోయెను. అందుచేత నామె యథాప్రకారము ఆ వృత్తినే అవలంబించుచుండెను. ఆమె "అయ్యో! జీవ

నోపాధికి మఱియొక ఉపాయములేని కారణమున నేనీ దుర్వృత్తి నవలంబించుచున్నాను. దేవా! నన్ను రక్షింపు" మని రాత్రింబగళ్లు భగవంతుని వేడికొనుచుండెను.

పిమ్మట నా సన్న్యాసి తనలో నిట్లు తలపోసెను: "నా యుపదేశము నిష్ప్రయోజనమయినట్లు తోచుచున్నది. ఆమె తన వృత్తిని మానుకొనలేదు. ఆమె యింటికే వచ్చు పురుషులను లెక్కపెట్టి చూచెదను."

అది మొదలుకొని ఆమె యింటికి వచ్చువారి సంఖ్య నెన్నుటయందే ఆ సన్న్యాసి ఆసక్తి గలిగియుండెను. అతడు లెక్కించుటకు చిన్నబొమ్మరాళ్ల నుపయోగించెను. దినములు గడచిన కొలది బొమ్మరాళ్లగుట్ట పెంపొందుచుండెను. ఒకనా డతడా వేశ్యను పిలిచి రాళ్లగుట్టను చూపి యిట్లనెను: "నీవీ రాళ్లగుట్టను చూడుము. దానివలన నీ పాపముల మేర తెలియనగును. నా హితబోధను సరకుచేయక, నీవు నీ మునుపటి వృత్తిని విడువకయున్నావు. నేను మందలించినను, వినక, నీవు చేసిన పాపము ఈ గుట్టవలన తెలియును. నీకు రానున్న హింసలను ఈ గుట్టవలన తెలిసికొనుము. నీవు ముక్తికెటుల ఆశపడగలవు? పొమ్ము." బొమ్మరాళ్లరాశిని జూడగా ఆ దాసియొక్క శరీరము కంపించెను. అంత నామె "ఓ భగవంతుడా! యిక నాకేమి గతి" యనుచు భయవిభ్రమములతో తనగృహమున కేగి దుఃఖము నాపుకొనలేక యేడ్వసాగెను. "ఓ కృష్ణా! దయతో న న్నుద్ధరించి నాపాపముల శమింపజేయుము. నీ కిష్టమయిన

మొదల నా ప్రాణములనుకూడ తీసికొను" మనుచు ఆమె మూర్ఛిల్లెను.

భగవంతునకా నిర్భాగ్యురాలియందు దయకలిగెను. ఆమె ఆ రాత్రియే చనిపోయెను. సన్న్యాసియు ఆ రాత్రియే అసువుల బాసెను. ఆశ్చర్య మేమనగా సన్న్యాసి యొక్క ఆత్మను యమదూతలు నరకలోకమున కీడ్చుకొని పోయిరి. పశ్చాత్తాపపడిన వేశ్య విష్ణులోకమును చేరెను. స్వర్గారోహణము చేయుచున్న వేశ్యయొక్క ఆత్మను సన్న్యాసి చూచి, "ఓసీ! నీవు స్వర్గమున కెట్లు పోగలిగితివి? నీవు లెక్కలేని పాపములు చేసితివి. నేను లెక్కించుట కుప యోగించిన బొమ్మరాళ్లు పెద్దకుప్పగా పెరిగియున్నవి. నేను జూడ నిర్మలుడనయిన సన్న్యాసిని. ఎప్పుడు నొక పాపము నైనను చేయలేదు. భగవంతుడు నన్ను నరకమునకు పొమ్మని, నిన్ను స్వర్గమునకు తీసికొనిపోవుచున్నాడు. భగ వంతునకు ధర్మాధర్మములు తెలిసినట్లు గోచరింపదు" అని యడిచెను.

విష్ణుదూత లా సన్న్యాసిని శాంతపఱచి యిట్లనిరి: "అయ్యా! నీవు ఆవేశపడకుము. భగవంతుని జ్ఞానమెప్పు డును పొరపడదు. నీ జీవితము కేవలము దాంభికమయినది. కీర్తిప్రతిష్ఠలను సంపాదించుటకే నీవు సన్న్యాసివేషమును బూనితివి. అదిగో నీ భౌతికశరీరమును జూడుము. అది నిజ ముగా శుద్ధమయినదియే. అందుచేత మనుజులు దానిని పూలతో నలంకరించి సన్నాయిమేళముతో మోసికొని

పోవనున్నారు. పరిశుభ్రముగా నుంచుకొనిన నీ శరీరమునకు పక్రమమైన గౌరవము జరిగినది. కాని నీవుమాత్రము నరక మునకు బోవుచున్నావు. ఈ వేశ్యయొక్క శరీరమనేక పాప ముల కాకరమయినది. దానిని గ్రద్దలు, రాబందులు చీల్చి తినుచున్నవి చూడుము. చివరకెవరికిని దానిని దహించు టకుగూడ మనస్సు రాకపోయెను. అయినను ఆమెయొక్క ఆత్మ పరిశుభ్రమైనది. ఆ కారణమున మేము దానిని దేవుని సమక్షమునకు తీసికొనిపోవుచున్నాము. వేశ్యయొక్క పాప ములను లెక్కించితివి కదా! ఆమె పాపములగూర్చి నీ వెక్కువఆసక్తి కల్పించుకొనినకారణమున వాని మాలిన్యము నీకు చుట్టుకొనినది. పాపములను గుణించి పశ్చాత్తాపపడి భగవంతు నాశ్రయముపొందినట్టి ఆమెయొక్క హృదయము మాలిన్యరహితమై నిర్మలమయ్యెను. ఆమె పాపములను లెక్కపెట్టిన నీవు వానిని నీ తలమీద మోయు చున్నావు."

ఇతరుల పాపములను లెక్కించుట భక్తునిపనికాదు. భగవంతుని లీలల నెవరు తెలిసికొనగలరు! ఆయన మనకు మార్గము చూపుటయేకాక మనలను పరీక్షించును. మన లోని మంచిచెడుగులను ఆయనమాత్రమే తెలిసికొని న్యాయ ముగ విమర్శనచేయగలడు. మన హృదయమును సన్మార్గ ముందే దృఢముగా నిల్పి యితరుల తప్పులను సానుభూతిలో జూడవలెను.

# 10. మాటలు—మౌనము

మంచిప్రవర్తనచేతను, భక్తిమూలమునను ఈశ్వర కటాక్షము చేతను జ్ఞానసిద్ధిపొందినవాడు ఇతరులతో మాటలాడకపోయినను వారి కాదర్శప్రాయుడగును. ప్రేమ మార్గమున భగవంతుని తెలిసికొనినవారు మాత్రమే యిట్టి స్థితికి రాగలరు. శాస్త్రజ్ఞానము చాలదు. హిమాలయ పర్వతముల మంచునుగురించి పుస్తకమున చదివినవాడుగాని, యితరులనుండి వినినవాడుగాని, యితరులతో దానినిగురించి వివరముగా మాటలాడలేడు. దానిని చూచి చేతులతో స్పృశించి రుచిచూచినవారు మాత్రమే దాని విషయమును తెలిసికొనినవారై యితరులతో మాటలాడుట కధికారము కలిగియుందురు.

"నాకు ముక్త్యవస్థ తెలిసినది. నేను దాని నితరులకు బోధింప నుద్దేశించితిని. నాచుట్టును శిష్యులను సమకూర్చుకొనెదను" అని పలికెడు భక్తుడు స్పష్టముగ నహంకారము కలిగినవాడే. భగవంతునిచే అధికృతుడయినవానికి మాటలాడుశక్తి తనయంతటతానే కలుగును. భగవంతునిచే అధికారమునొందక తత్త్వమును బోధించుటకు యత్నించుట నిష్ప్రయోజనమయిన అహంకారప్రదర్శనమగును. పుష్పములలో మకరందము నిండినపుడు తమకుతామే తేనెటీగలువచ్చి వానిపై వ్రాలును. బెల్లమున్నచోటికి చీమలను పిలుచుకొనిరావలసిన అవసరములేదు. నిజమయిన జ్ఞానమునుపొంది తదనుసారముగ తన జీవితమును గడపునట్టి

మానుజానొద్దకు మనుష్యులను పిలుచుట అనవసరము. అమృత ప్రవాహమువలె అన్ని ప్రక్కలకు అతని జ్ఞానము ప్రసరించును. తమకుతామే అందఱును అతనియొద్దకు జేరుదురు. ఇట్లు చీమలను, తేనెటీగలను ఆకర్షించు మాధుర్యము హృదయాంతరాళమున ఉండవలెను. ఈశ్వర సృష్టిలో మనస్సుయొక్క స్వచ్ఛత బెల్లమువలె తీపైనది. సూదంటురాయి ఇనుము నాకర్షించునట్లు పరిశుద్ధాత్మ శిష్యులను తనవైపున కాకర్షించుకొనును.

దేవునికృప పొందనివారు చేయు బోధ నిష్ప్రయోజనము. అట్టివారి మాట లెవరి హృదయమునను నాటుకొనవు. భక్తిచేతను, సత్ప్రవర్తనచేతను, ఈశ్వరుని అధికారము పొందినప్పుడే శిష్యులను బడసి గురుధర్మముల నిర్వర్తింపనగును. ఈశ్వరుని కరుణ లేనిది మనుష్యుని ప్రయత్నములు నిష్ప్రయోజనములు.

ప్రకాశవంతమైన దీపము వెలిగినపుడు ఎచటనుండియో పురుగులు గుంపులుగాచేరి అందులో పడును. ఎవరును వానిని పిలువరు. యథార్థజ్ఞానముగలవారు ప్రకాశవంతమయిన దీపమువంటివారు. వారి ప్రకాశమే శిష్యులను వారియొద్దకు నాకర్షించును. వారెచటనుండి వత్తురో మనము చెప్పజాలము.

* * *

ఈశ్వర కృప బడసిన గురువు చెప్పనదంతయు చేయునదంతయు ఒకవిధమైన దైవారాధనగ నుండును

ఆయన వచించునదియు, చేయునదియు ఉపదేశమే యగును. మామూలు పద్ధతిగ బోధ చేయనవసరము లేదు. మను జుడు ఈశ్వరుని తన హృదయమునందు చూచి, తన మన సులో అతనినిగుఱించిన చింతనే దృఢముగా నిలుపుకొనిన, అదియే ఆ మనుజుని ప్రబోధముగా పరిణమించును. సంసార బంధమునుండి తన్ను తాను వదలించుకొనుటకు చేయు ప్రయత్నమే ఆ మనుజునియొక్క ఉపదేశముగ ఉపకరిం చును. వికసించిన పుష్పముమాడ్కి అతని ఆత్మ మక రందముతో నిండి తేనెటీగల నాకర్షించి వాని కాహార మొసగును.

పెద్ద ధాన్యపు కొట్టులో ధాన్యమును కొలిచి అమ్ముట నీవు చూచితివా! ఒక మనుష్యుడు విడువక కొలుచుచుండును. అతడు కొలిచినకొలది ధాన్యము కుప్ప నుండిజారి రాశిగా పడుచుండును. సద్గురువు ఉపదేశించు మార్గమట్టిదే. మిక్కిలి పెద్దదగు దేవుని కొట్టునుండి అతడు ధాన్యమును కొలిచివేయుచుండును. జ్ఞానము, బోధ అందుండి వెడలుచుండును. కొలువబడుచుండు ధాన్య మీశ్వరునిది. అయితే చిల్లర అంగడిలోని ధాన్యమువలె గాక, పరిశుద్ధాత్మలోని పరమేశ్వరుని జ్ఞానమనెడి సరకు ఎన్నటికిని తరుగదు. కేవల శాస్త్రజ్ఞానముమీద ఆధార పడి చేయు ఉపదేశమునకును ఈశ్వరుని కృపవలన జనించిన యుపదేశమునకును ఇదియే వ్యత్యాసము. ఈశ్వర కటాక్ష ముచే కలిగిన ఉపదేశమున కింతయని పరిమితి లేదు.

శాస్త్రజనితమయిన బోధ పరిమితిగలదియగుటచే త్వరలోనే ఖర్చయిపోవును.

వర్షము కురిసినప్పుడు మిద్దెనుండి నీళ్లు పెద్ద ధారగా క్రిందపడును. ఆవు లేక పెద్దపులియొక్క నోరువలె తూములు పెట్టబడియుండును. వానిగుండా నీరు ప్రవహించునపుడు ఆవు లేక పెద్దపులి నోటినుండి నీరు వచ్చుచున్నట్లు గోచరించును. వాస్తవముగా ఆ తూములగుండా వెడలు నీరు ఆకాశమునుండిపడు వర్షముదే. జ్ఞానులయొక్క ప్రబోధము ఆకాశమునుండి వెడలు వర్షమువంటిది. ధన్యతనొందిన గురువుల పెదవులనుండి పరమేశ్వరుని కరుణ వెడలును.

చెరువులో కుండను ముంచుచుండునపుడు గుడగుడమను ధ్వని వినబడును. కుండ నిండిన పిదప ధ్వని నిలిచిపోవును. శాస్త్రజ్ఞానము మాత్రమే కలవారు ఎక్కువగ మాటలాడుదురు. సంపూర్ణమయిన జ్ఞానానుభూతి నొందినవారు ఈశ్వర దర్శనమును మౌనముతో నానందించుచు తమ యానందానుభవములో నిమగ్నులగుదురు.

విందుకు అతిథులు సమకూడినపుడు ఎక్కువగ మాటలాడుచుందురు. భోజనమున కుపక్రమించిన క్షణమునందే ధ్వని తగ్గిపోవును. వడ్డన జరుగునపుడు ఈ శబ్దము ముప్పాతికవంతు తఱుగును. పాయసము వడ్డించునపుడు భోజనము చేయువారు నిశ్శబ్దముగా నుందురు. పాయసము జుఱ్ఱుకొనునప్పుడు కలుగు చప్పుడు మాత్రమే వినబడును. భోజనానంతరము వారరుగుమీదకుచేరి నిద్రింతురు.

ఈశ్వరుని చూడక యుండునంతవఱకు మాత్రము వాద ప్రతివాదములు జరుగుచుండును. పరమేశ్వరుని దర్శన భాగ్యము లభించినపిమ్మట మాటలతోడనే అవసరముండదు.

బయటికి, సంతలోని ధ్వని చాల హెచ్చుగానుండును. అది సంతలోని పలువిధములగు శబ్దముల కలయిక. సంతలో చేరబడినపిమ్మట ఆ వివిధమైన ధ్వనులు వినబడవు. అచ్చట వస్తువుల ధరలను విచారించి బేరము కుదుర్చుకొను ధోరణిలో మన ముండిపోవుదుము. భక్తియొక్క రీతియు నిట్టిదే. భగవంతునికి దూరముగానున్నప్పుడు వాదములవలన కలుగు ధ్వనులచే మన చెవులు తడకలు కట్టిపోవును. ఆయన యొద్దకు వెళ్లి యెదుట నిలిచినప్పుడు వాదములయొక్క ధ్వని సమసిపోగా మన మాయనలో లయమగుదుము.

బూర్లె మూకుడులోగల నేతియందు రొట్టె కాల్చునపుడు ధ్వని హెచ్చుగానుండును. అది పూర్తిగా కాలినపిదప ధ్వనియుండదు. భక్తులు ప్రారంభములో ఎక్కువగా మాటలాడుచుందురు. జ్ఞానవృద్ధి యగుకొలది మాటలాడుట తగ్గిపోవును.

## 11. నూనెగిన్నె

ఒకానొక సమయమున నారదముని హృదయములో నహంకారము ప్రవేశించెను. తనకంటెను పరమభక్తుడు ఎవడును లేడని యతడూహించెను. భగవంతుడది తెలిసికొని యతనితో నిట్లనెను: “ఓ నారదా! నీవు భూలోక

మునకు పొమ్ము. అచట నా పరమభక్తుడొకడు కలడు. అతనిని పరిచయపఱచుకొని, అతని సద్గుణములను గమనించి రమ్ము. అందుచే నీకు మేలు కలుగును.''

''మంచిది. ఈ ఆజ్ఞను నెరవేర్చెదను. నేను వెళ్లి యా భక్తునియొక్క విశిష్టతను తెలిసికొనివచ్చెదను. నాకంటె నెక్కుడయిన భక్తుడొకడుండునా! ఈ వింతను నేను చూతునుగాక'' యని నారదుడు తనలో ననుకొనుచు భూలోకమునకు వచ్చెను. ఒకానొక గృహములో వ్యవసాయము చేయువాని నొకనిని చూచెను. ఆ సేద్యగాడు ప్రాతఃకాలమున నిద్ర లేచినవెంటనే యొకమాఱు హరిని స్మరించి తన భుజముపై నాగలినిడికొని పొలమునకు బోయెను. దినమంతయు పొలములో పాటుపడి అతడు తన యింటికి తిరిగివచ్చెను. నిద్రపోవుటకుముందు మఱియొకమాఱు హరినామస్మరణ చేసెను.

నారదు డిదియంతయు చూచి ''సరి, ఇతడు నాకంటెను ఎక్కువ భక్తుడా!'' అని ఆశ్చర్యముతో పలికి తనలో నవ్వుకొనెను. మరునాడత డేమిచేయునది చూచుటకు తా నచటనుండెను. ఆ రైతు ఉదయమున లేచిన తోడనే మఱల హరి నామమును స్మరించి, పొలమునకు వెళ్లి పగలంతయు కష్టపడి పనిచేసి, యింటికి వచ్చి మఱల భగవన్నామము నొక్కసారి ఉచ్చరించి నిద్రపోయెను. నారదుడు ''ఇంతయేకదా!'' అని తలచి విష్ణులోకమునకు వెడలెను.

నారదుడు విష్ణువుతో నిటుల మనవిచేసెను : "మీరు చెప్పిన భక్తుని నేను కనుగొంటిని. అతడంత గొప్ప భక్తుడుగా నాకు కనుపించలేదు. సేద్యముచేయుటలో నతని మనస్సు మునిగియున్నది. తమాషా చేయుటకమాత్రమే. మీరు నన్నతనియొద్దకు పంపినట్లు నాకు తోచుచున్నది."

అపుడు విష్ణువు "ఓ నారదా! ఈ గిన్నను నీ చేత పట్టుకొనుము" అనగా, ఆ ముని దేవుడిచ్చిన నూనె గిన్నెను స్వీకరించెను. "ఈ గిన్నె యంచువఱకు నూనెతో నిండియున్నది. నీవు దీనిని జాగ్రత్తగా తీసికొని ఒకమాఱు భూమికి ప్రదక్షిణచేయుము. అట్లు చేయునపుడొక బొట్టు నూనెయయినను క్రింద పడకుండునట్లు చూడు" మని విష్ణువనెను.

భగవంతుడు సెలవిచ్చినట్లు నారదుడొనర్చెను. ఒక చుక్క నూనెయయినను క్రిందపడకుండునట్లు జాగరూకత చూపి విజయగర్వముతో తిరిగివచ్చెను.

"నీవు తిరిగివచ్చితివి. సంతోషమే, కాని నీవు భూప్రదక్షిణము సల్పునపుడు నన్నెన్నిమాఱులు స్మరించితివో చెప్పు"మని ప్రభువు ప్రశ్నించెను. "ఓ ప్రభూ! నిన్ను స్మరించుటకు నాకెట్లు వీలగును! ఒకచుక్క నూనెకూడ తొలకక యుండునట్లు ప్రదక్షిణము చేయుమని మీరాజ్ఞాపించితిరి. అదియే చాల కష్టమయిన పని" అని నారదు డనెను.

"మునివరా! నీ మనస్సంతయు ఆ నూనెగిన్నెమీద లగ్నమైనందున నీవు నన్ను తలపోయవైతివి. జ్ఞానియయిన

నీవంటివాని స్థితియే యిట్లుండ, నిక పామరుడైన ఆ రైతు యొక్క స్థితి యెటులనుండునో ఆలోచింపుము. గొప్పదైన తన కుటుంబభారమును వహించుచు నతడు దినమునకు రెండుమారులైనను నా నామము నుచ్చరించుటలేదా! అతని భక్తియొక్క విశిష్టత నీ కిపుడైనను తెలిసినదా!" యని మహాప్రభు వనెను. నారదుడు తాను గర్వపడినందు లకు లజ్జించెను.

*　　　　*　　　　*

మనస్సు కామభోగములందుగాని, యింద్రియ విష యములందుగాని చిక్కికొని పరధ్యానము నొందినపుడు మనము నిగ్రహముచూపి దానిని మంచి తలపులలోనికి దిగు నట్లు చూడవలెను. ఈ ప్రయత్నము ప్రారంభములో ఫలింపకపోవచ్చును. అంతట మనము భగవంతుని స్నేహి తునిగాగాని, తండ్రిగాగాని లేక తల్లిగాగాని భావించి అతని శరణుజొచ్చి, అతని నామము జపించి, పాపములనుండి రక్షింపుమని వేడుకొనవలెను. దేవిని మన మనోదృష్టి యెదుట నిల్పి తల్లికి మనము ప్రణామము చేయురీతిగ ఆమెకు నమస్కరింపవలెను. రామ, వాసుదేవ, గోవిందాది నామములు స్మరించుటకు ఉపయోగపడును. మనోమాలి న్యము వీడజేయుటందు ప్రభువుయొక్క పలునామములు సంజీవి వంటివి.

"ఈశ్వరుని నామావళిని మననము చేయుటవలన నాకెట్టి సంతోషము కనబడదు. దీనికి కారణమేమి" యని

యొకానొకప్పు డొకరు పరమహంసను ప్రశ్నించిరి. అందు లకు పరమహంస యిట్లు బదులు చెప్పెను.

"నాయనా! భగవంతుని ప్రార్థింపుము. ఆయన యెదుట నేడ్చి 'నామస్మరణముచే కలుగు సంతోషమును నా కిమ్మ'ని వేడుము. భగవంతుడు నీ ప్రార్థన నీడేర్చును. నా తల్లీ, నా తండ్రీ, ఓ కృష్ణా, రామ, సీత, గోపాల, గోవింద, మహాదేవ, ఈశ్వర, శివ, మొదలగు నామము లలో నేదియైనను చాలును. నిత్యము నామజపము చేయు చుండుము. పోనుపోను నీ కందలి మాధుర్యము తెలియును. జబ్బుగా నున్నప్పుడు మొదట నీ కన్న మిష్టముగనుండదు. క్రమశః రుచిపుట్టును. రోగ నివారణసూచన అదియే.

"భగవంతుడును ఆయన నామమును వేరు వేరు కావు. శ్రీ కృష్ణుడు తులాభారమున తూగినట్లు నీకు తెలియును గదా! త్రాసులో నొకతట్టున శ్రీ కృష్ణుడు కూర్చొనెను. రెండవదానిలో రుక్మిణి యొక తులసీ దళమును, భగవన్నా మమును, ఇడినంతనే కృష్ణుడు కూర్చొనియున్న వైపున కంటె ఇదియె క్రిందికి వ్రాలెను.

"చైతన్యులవారు నుడివినట్లు ప్రభువు నామము బీజమువంటిది. రాజమందిరమందలి స్తంభముపై నున్న వి త్తనము చాల సంవత్సరముల కాలమువఱకు అటులనే వ్యర్థముగ నుండవచ్చును. కాని ఆ భవనము శిథిలమై పోయి నప్పు డా వి త్తనము భూమిపైబడి మట్టిలోనికి పోవును. వర్షము కురిసినప్పు డది మొలకెత్తి పుష్పఫల సమన్వితమైన

వృక్షముగా పెరుగును. అట్లే భగవన్నామ మెన్నటికిని నిష్ప్రయోజనము కాదు.''

## 12. దేవీకవచము

వృక్షమునందు వేరుమొదలు చిట్టచివరి శాఖవఱకు రసము వ్యాపించియుండును. ఆ రసము ఆకు, కొమ్మ, పుష్పము, ఫలముగా మారి దృశ్యమగును. ఆ రీతిగనే ఒక్కటియేయగు మూలతత్త్వము ఈ ప్రపంచమున అనేక వస్తువులుగా గోచరించును. ఈ సృష్టియందంతటను వ్యాపించియుండు పరతత్త్వమునకే మన పెద్దలు శక్తి, మాయ మొదలగు పెక్కుపేర్లిడిరి. సర్వాంతర్యామియగు ఆ పరతత్త్వముయొక్క పరిణామములే మనము చూచువస్తువులును, మనల నావరించిన శక్తులును. పుట్టి, పెరిగి, చచ్చు సమస్త జీవరాసులును ఆ మహాశక్తియొక్క ప్రత్యక్ష రూపములే. ఏకమైన ఆ పరమాత్మ తన యిచ్ఛచే భిన్నరూపములయ్యెను. ఇట్లు భిన్నమైనవస్తువులు మఱల నొకటియగుటకు ప్రయత్నించును. మనకు గోచరించు పలువిధములగు భౌతిక మానసికాకర్షణ శక్తులకు మూలకారణమిదియే. దీనిని భౌతికవిజ్ఞానులు పరిశోధించి మూలాంగవిభజన చేసిరి. వివిధ ధాతువుల సంబంధము, ఐక్యమగుటకు వానియొక్క కోరిక, ఆకర్షణశక్తులలో నొకటి. ఇతర వస్తువుల నాకర్షించు భూమియొక్క శక్తియు, విశ్వాకర్షణశక్తియు, అనేకములయిన మండలములు పరిభ్రమించుచుండుటయు, ఆ దివ్యశక్తియొక్క

లీలలే. శాస్త్రజ్ఞులు విశ్వాకర్షణశక్తియొక్క ప్రవర్తనమును లోతుగా పరిశీలించి దానిని వివరింప యత్నించిరి. గణిత శాస్త్రములో ఇదియొక ముఖ్యభాగము. ఆ ఆకర్షణశక్తి యొక్క స్వభావము, దానిని పరిపాలించు నియమములు— ఇదంతయు ఏ మూలసత్యముయొక్క దృశ్యరూపమో: ఇవన్నియు వారి పరిశోధనల కతీతమయినవి. ఈ పరతత్త్వమునే శ్రీరామకృష్ణుడు గాఢభక్తిపూరిత హృదయముతో మహాశక్తిగా, మాధవిగా, దుర్గగా, దేవిగా అర్చించెను. సహస్రనామములిడి శ్రీ శంకరు లుపాసించినదియు ఈ మహాశక్తినే.

ఈ మహాశక్తియొక్క అభివ్యక్తరూపములలో స్త్రీ పురుషుల పరస్పరాకర్షణశక్తి యొకటి. మానవకోటికి ఈ వ్యామోహము దుర్జయమని మనకందఱకు తెలియును. పరాశక్తిచే ప్రసాదితమైన ఈ సహజశక్తి మనుజులకు మితిలేని ఆనందమునుకూడ ఇచ్చును. దానితోబాటు అది యెక్కువ మనోవేదననుకూడ కలిగించును. సంసారజీవనము, అందు జనించి వృద్ధిచెందు సంతోషము, ఈ ఆకర్షణశక్తియొక్క లాభములు. అది యనేక కష్టములకును, దుఃఖములకును, పాపములకునుకూడ కారణభూతము. పూర్వకాలమున ఈ మహత్తరమైన ఆకర్షణశక్తి మానవుని ‘పశుత్వము’ అనుపేర పరగుచుండెను. ఈ ప్రకృతిధర్మము జీవకోటి కంతటికిని సామాన్యము. దానిని దూషించిన ప్రయోజనములేదు. దానిని నిగ్రహించి సన్మార్గమున నడి

పింపుమని మన ఆచార్యమహాపురుషుల ఉపదేశము. ఈ ఆకర్షణశక్తిని స్వచ్ఛమైన మార్గముల ప్రవహింపజేయుటకు గాను సంసారజీవనమును, ఆలుబిడ్డలయెడ నిర్మలమైన ప్రేమయును, సంఘమేర్పరచిన ఉత్తమమార్గములు. మానవుని పశుత్వము నిర్మలమయిన మార్గమును వీడి తప్పుడు త్రోవల త్రొక్కనేని అది తప్పక వారి కెక్కువ కీడుచేసి మితిలేని దుఃఖమును కలుగజేయును.

కొందఱు మహాపురుషులు దానిని పూర్తిగ స్వాధీనపఱచుకొని, ఆత్మశక్తిగా మార్చి, యేమాత్రము చలింపని బ్రహ్మచర్యస్థితిలో నుందురు. మహాశక్తి అనుగ్రహముచే వారి శరీరమునకు, ఆత్మకు, ఈ పశుత్వముయొక్క ప్రభావమంతయు బలవర్ధకమగు ఎరువుగా పరిణమించి వారి నున్నత స్థితికి తీసికొనిపోవును. దానిని పూర్తిగ స్వాధీనముచేసికొనజాలనివానికికూడ, అతని ఆత్మశక్తి వృద్ధినొంది, విజ్ఞానము పుష్పించి చివరకతడు తన పశుస్వభావమును మఱచునట్లో లేక జయించునట్లో చేయును.

*　　　*　　　*

స్వాభావికమయిన మంచితనము, సాంఘికజీవనమున కనువగు సంస్కృతి తమిళులకు జన్మహక్కులు గాగలవు. చురుకైన బుద్ధి, ఉత్సాహము, సంతోషముగల స్వభావము మనకు సంక్రమించినవి. తమిళుల భావములు నిరంకుశోద్రేకరూపమును ధరింపక, నియమితమును, నిష్పాక్షికమును అగు ప్రవర్తనగా పరిణమించును. ఈ సద్గుణపుంజము మధ్య పశు

త్వముయొక్క ఆకర్షణశక్తి అందఱకు ప్రమాదము కలుగ జేయునదియై యున్నది. మనుజులకును, పశువులకును సామాన్యమగు ఈ శక్తిని స్వాధీనములోనికి తెచ్చి త్రొక్కిపట్టి యుంచనియెడల అది పెనుభూతమై బుద్ధి నావరించి, మంచి చెడ్డల వివేచనశక్తిని పోగొట్టి, సంఘమునకును, మానవ వ్యక్తిత్వమునకును తీవ్రమగు ఆపదను కలిగించును. ఈ ఆపదకు మన మవకాశము నీయక జాగ్రత్త పుచ్చుకొన వలెను. అట్లు కానిచో సంఘముయొక్క మంచిగుణము లన్నియు నశించి ఈ పిశాచము వాతబడును.

దేశములోని స్త్రీలు ప్రమాదము కలుగునను భీతిలేక వీథులలోనికిని, దుకాణములకును, ఇతర ప్రదేశముల కును ఒంటరిగా నెప్పుడు పోగలుగుదురో అప్పుడే సంఘము నిజమైన సంస్కృతిగలదిగ నెంచనగును. గొప్ప నాగరకత గలదని నిర్ణయించుట కిదియే పరిశోధనమార్గము. ఆదర్శ జీవితమునందు ఈ లక్షణము ఉండితీరవలెను. మదరాసు వీథులలో పలుతరగతుల నాగరకతలు గానవగును. ఇప్పు డిదివఱకు నెన్నడును కననిరీతిగ అన్నితరగతుల స్త్రీ పురుషులు మంచివియును, శుభ్రములునగు దుస్తులను ధరించి తిరుగుదురు. అయినను పురుషుల నడవడిని గమనించితిమేని; వీరి పశుత్వము స్వాధీనమునకు వచ్చినదా యను సందేహము అప్పుడప్పుడు జనించును. పురుషులయెదుట స్త్రీలు సహజ ముగా సిగ్గుచెందుదురు. కాని సిగ్గువేఱు, భయమువేఱు. వారి సోదరులైన పురుషుల సమక్షమున మన స్త్రీ లెందు

లకు భయపడుచున్నారు! పురుషుల తలంపులు, భావములు నిర్మలములయినచో స్త్రీలు వారియెడ భయపడ నవసర ముండదు. చూపులలో హృదయప్రవృత్తులు గోచరించును. పురుషుల ముఖమునందును, కండ్లలోను వికారచిహ్నములు గోచరించుటచేతనే స్త్రీలు వారినిచూచి భయము చెందు దురు. పురుషులవలన భయముచెందు స్త్రీలుగల సంఘ మును గురించి మన మేమనుకొనవలెను? మగవారు తమ పశుత్వమును జయించినగాని సంఘమింకను సరియగు సంస్కృతిని పొందలేదని మనము ఎంచవలసియుండును. నేనింత విస్పష్టముగ చెప్పినందుల కెవరును తప్పుపట్టకుందురు గాక యని ఆశించుచున్నాను.

శ్రీరామకృష్ణుడు ఏతీరున తానుచూచిన ప్రతిస్త్రీని దేవియొక్క యవతారముగా పరిగణించుచుండెనో, ఆ రీతి గనే మనముకూడ తలంచి మన పశుస్వభావమును జయింప నగును. వ్యభిచారవృత్తిచే దుష్కీర్తిపాలైన స్త్రీలను సైతము భగవాన్ రామకృష్ణుడు దుర్గాదేవిరూపములుగనే చూచుచుండెను. అట్టి స్త్రీని చూచినను ఆయన హృదయ ములో తన తల్లియెడల నుద్భవించునట్టి ప్రేమ, భక్తి, ఉద యించును. మనము మన హృదయములో పశుస్వభావమును చొరకుండ చేయగోరితిమేని శ్రీరామకృష్ణుడు చనిన త్రోవను పోవలెను. అవిచ్ఛిన్న ప్రయత్నముచే సాధింపరాని దేదియు లేదు. సీత, పార్వతి, లక్ష్మి, గౌరి, ఈశ్వరి, అంబ: ఇవన్నియు దేవీనామములే. స్త్రీరూపము చూచినపుడెల్ల మనము

శ్రీరామకృష్ణుని జ్ఞప్తికి తెచ్చుకొందుముగాక. దేవీనామములను మన హృదయమునందును, వాక్కునందును నిల్పి 'ఈమె దేవియే, ఈమెయు పరాశక్తియొక్క అవతారమే. నా హృదయములో నామెకు ప్రణమిల్లుదుగాక' అని మనలో అనుకొనవలెను. అట్టి తలంపుతో మనము సంఘమును, మనలనుకూడ సేవింపవలెను. మనము పరిశుద్ధముగ జీవించుటకును, ఉత్తమసంస్కృతి నొందుటకును శ్రీరామకృష్ణుడు మనకు ఈ దేవీకవచమును ప్రసాదించెను. దానిని మనము సద్వినియోగము చేయుదుముగాక.

* * *

కళాశాలలలోను, పాఠశాలలలోను చదువు యువకులు అన్నిపాఠములకంటె ఈ పాఠమును తప్పక నేర్చుకొనవలెను. చిత్తశుద్ధి అన్నిటికన్న ముఖ్యము. నిర్మలత్వము శరీరమందును, బట్టలందును మాత్రము ఉండిన చాలదు. పశుస్వభావము మనస్సును స్వాధీనముచేసికొననీయక మనస్సును పూర్తిగా నిర్మలముగా నుండునట్లుగవరచుకొనుట ముఖ్య కర్తవ్యము. పశుస్వభావమును ప్రదర్శించు చిత్రములు, కథలు, పుస్తకములు మన సంస్కృతిని చెరచునట్టివి. పశుస్వభావశక్తిని ప్రయోగించి అనృతము సత్యముగా కనబడునట్లు చేయు మనుష్యులకు మన సంఘములో నిప్పటి పరిస్థితులలో ననేకములగు సదుపాయములు గలవు. మన యువకుల హృదయములు వాస్తవముగా నిర్మలమైనవే. వారి పశుస్వభావమును పురికొల్పితిమేని వారిని పాష

ములలోని కీడ్పి సంఘమునకు పతనము గల్పించినవార మగుదుము. మనము పరాశక్తి నుపాసింపవలెను. కుటుంబములోని జీవితమున కౌన్నత్యము తేవలెను. మన దేశములో ఏ యాడుపిల్లయయినను నిర్భయముగా నెచ్చటనైనను, నెప్పుడైనను తిరుగుట సాధ్యమగునట్లును, ప్రతి యువకుడును ఆమెకు సోదరుడుగాను సంరక్షకుడుగాను ఉండుట నిస్సంశయ మగునట్లును, మనము దృఢమగు ఏర్పాట్లు చేయుదుముగాక. మన దేశమున నీతి విజృంభించుగాక.

## 13. నీళ్లపైని నావ

పడవ నీటిలో నుండవచ్చునుగాని, నీరు పడవలో నుండరాదు. అటుల జరిగినచో పడవ మునుగును. ఈ ప్రపంచములో జీవించు భక్తులయొక్క పరిస్థితియు నిట్టిదే. ప్రపంచమును మనస్సులోనికి చొరనీయరాదు. అటుల జరిగెనేని మనస్సు ప్రపంచమను పంకములో మునుగును.

గార్హస్థ్యము సలుపుము. గృహస్థధర్మము నిర్వర్తించుచు సదా దైవచింత చేయుచుండుము. గృహకృత్యములు లేనపుడు నీ చిత్తమునంతయు దేవునియందే నిల్పుము.

మంచిదాది తన యజమానురాలి చంటిబిడ్డకు పాలిచ్చి ప్రేమతో పెంచును. ఆ చంటిబిడ్డ తనదే అయినట్లు ఆమె యిట్లు చేసినను, ఆ బిడ్డ తనది కాదనియు, ఆ బిడ్డ పెద్దదైనపుడు తనకును దానికిని సంబంధముండదనియు, ఆ బిడ్డకు తనకుగల సంబంధము పాలిచ్చుట మాత్రమే అనియు,

తెలిసియే ఆమె తన ధర్మమును నెరవేర్చుచుండును. దాది తన కొప్పగింపబడిన బిడ్డ నేరీతిగా చూచునో, అదే రీతిగ నిజమైన భక్తుడు తన కుటుంబ జీవితమును చూడవలెను.

దాది తాను పనిచేయు నింటిని 'మాయిల్లు' అని నుడువునపుడు ఆమె హృదయములోని భావమెట్టిది? ఆమె సొంతయిల్లు గ్రామములో నెచటనో యున్నది. ఆమె పట్టణములో నౌకరి చేయును. ఆమె యజమానురాలి యింటిని 'మనయిల్లు' అని నుడువును. తన యజమానురాలి బిడ్డనెత్తుకొని 'మాయమ్మ, మా నాయనా' యని ఆడించును; 'మా గోపాలుం డల్లరివాడు, మా గోపాలున కాకలియయినది' ఈ విధముగా ఆ బిడ్డనుగూర్చి ప్రేమ పూరితమగు మాటలనాడును. అటుల మాటలాడినను, ఆ బిడ్డ యజమానురాలి బిడ్డయనియు, తన బిడ్డకాదనియు, తన బిడ్డ దాని ముత్తవ తల్లియొద్దనున్నదనియు ఆమె మరవదు. గృహస్థులైన భక్తులుకూడ తమ గృహస్థ ధర్మములను నెరవేర్చునపుడు ఆ దాదివంటి భావమునే కలిగియుండవలెను.

* * *

నీవు నివసించునది దేవుని గృహమునందు. అది భగవంతుని దను మాట మరవక యందుల కనుగుణముగా నీ గృహస్థ జీవనము సల్పుము. ఆ తలంపు నాటుకొనినచో అది నీ మనస్సునొక్క సుస్థిర భావరూపమును పొందును.

గృహస్థాశ్రమములో నుండియు ఈశ్వర సేవ చేయ జూచువారు కోటయొక్క ప్రాకారములోనుండి యుద్ధము

చేయు బంటులవంటివారు. ప్రపంచమును త్యజించి దైవము ననుసరించువారు బయలైన యుద్ధభూమిలో పోరు బంటుల వంటివారు. ఈ రెండు రకముల వారును తప్పక మంచి బంటులే. కోటలోనుండి పోరువారిది ఎక్కువ అనుకూలస్థితి. అందు తప్పేమియు లేదు.

బయలులో యుద్ధము చేయుటకుముందు బంట్లు ఆవరణ లోపల తుపాకి గుఱిపెట్టి కాల్చుటకై సాధన చేయుటను నీవు చూచియుందువు. అట్లే నిస్సంగత్వము బడయగోరువారికి గృహస్థ జీవనము సాధనప్రదేశము. కుటుంబములోనుండి జీవయాత్ర సల్పుట విరక్తిమార్గము నలవఱచుకొనుటకు ఎట్లు సాయపడు ననగా అందు నీ కన్ని సౌకర్యములును లభించుచుండును. నీ మనస్సునకు నిశ్చలత్వమును నిర్మలత్వమును గలుగజేయు గరిడీశాలగా గృహస్థ జీవనమును పరిగణింపుము.

నీ తండ్రితోగాని, భార్యతోగాని కలహించి కుటుంబము విడిచి సన్న్యాసము స్వీకరించిన, అది నిజమయిన సన్న్యాసము కాదు. అది "పులుపుద్రాక్ష" సన్న్యాసమనుపించుకొనును. అది యెక్కువ కాలముండదు. అనతి కాలముననే అట్టి సన్న్యాసియొక్క మనస్సు ప్రాతవిషయములకు మఱలగా నతడు తిరిగి గృహస్థుడగును.

తమ జీవిత ధర్మములను సక్రమముగ నెఱవేర్చుచు, అట్లు చేయుట దేవునియెడల తమకు గల బాధ్యత యని భక్తితో తలంచుచు, అదంతయు భగవంతుని కైంకర్యమే

యను భావమును మనసున కలవరచి అందువలన నిర్మలిన మగు హృదయమును పొంది ప్రపంచమును త్యజించు సన్న్యాసులే వారి త్యాగముయొక్క లాభమును బడయ గలరు. ప్రపంచమునగల అన్నివస్తువులును పరమేశ్వరుని యొక్క దృశ్యరూపములే అను సత్యము అట్టివారికి బోధ పడును.

ఒక యూరిలో సన్న్యాసులందరు వెళ్లి భోజనము చేయు సత్రమొకటి యుండెను. భిక్షమునకై తిరుగు నొక సన్న్యాసి ఒకనాడొక జమీందారు తన నౌకరును బాదు చుండుట చూచెను. జాలిపడి, సన్న్యాసి ఆ జమీందారు నొద్దకు వెళ్లి వినయపూర్వకముగా నిట్లు వేడెను. "అయ్యా, నా ప్రార్థనను విని ఇతనిని కొట్టుట మానుడు. ఈశ్వరుడు మీకు మేలుచేయును." కాని ఆ జమీందారునకు కోపము మఱియంత యెక్కువయ్యెను. ఆ నౌకరును వదలిపెట్టి స్పృహ తప్పి భూమిమీద వాలునంతవఱకు ఆ సన్న్యాసికి దేహశుద్ధి చేసెను. జమీందారు కోపము తగ్గినపిమ్మట గృహములోనికి వెళ్లెను. త్రోవలో పోవువారు భూమిపై బడియుండిన సన్న్యాసినిచూచి జాలిపడి ఈ వార్తను సత్రమునకు తెలిపిరి. తక్కిన సన్న్యాసులు అచటకు పరుగెత్తుకొనివచ్చి, దెబ్బలు తినినవానిని లేవదీసి సత్రమునకు మోసికొనిపోయిరి. ముఖముపై చల్లనినీళ్లను చల్లినపిమ్మట అతడు తెప్పరిల్లెను. వారిలో నొకడు కొంచెము త్రాగుటకు పాలను అతనికిచ్చెను. కొంతసేపటికి ఆ సన్న్యాసికి తెలివి వచ్చెను. "సోదరా!

నే నెవరనో చెప్పగలవా!" అని యొక సన్న్యాసి అడిగెను. "సోదరా! నిన్ను నే నెఱుగుదును. నీవు నన్ను మొదట కొట్టి యిప్పుడు నా నోటిలో పాలుపోసితివి" అని దెబ్బలు తినిన సన్న్యాసి జవాబు చెప్పెను. ఆ సన్న్యాసియే సరియైన జ్ఞానముపొందిన యతడు. తనను కొట్టినవానికిని, తనకు స్మృతి తెప్పించినవానికిని అతని కెట్టి భేదము గోచరింప లేదు. మంచిచెడ్డలు, సుఖదుఃఖములు ప్రభువుయొక్క లీలలే.

## 14. ప్రజాసేవ

ఒకదినమున కొందరు యువకులు పరమహంసు రొద్దకు వచ్చి "మేము ప్రజాసేవ జేయ నిశ్చయించుకొంటి" మని చెప్పిరి. శ్రీరామకృష్ణుడు ఆ ఉత్సాహపూరితుల కిట్లు నుడివెను.

"మీ నిశ్చయము ప్రశంసనీయమైనదే. ప్రజాసేవలో నిమగ్నులగుట మంచిదే. కాని మున్ముందు దైవోపాసన సల్పి యతనినిగురించి ధ్యానముచేసి మీ హృదయములను శుభ్రపఱచికొని తరువాత ప్రజాసేవ చేయబూనుడు. దైవ మునుగూర్చి చింతించితిరేని మీ శక్తి వృద్ధిజెందును. భక్తి యుతులై ఈశ్వరుని ప్రార్థించితిరేని మంచిచేయుటకు మీకు సమర్థతగల్గును. ఈశ్వరకృపచే మీ పని బాగుగా చేయు టకు నిపుణతయును, తగిన సౌకర్యములును గలుగును. ఎల్లప్పు డును భగవంతుని ప్రార్థించుచుండుడు. అతనిని ప్రేమించిన వారతనిని కీర్తించుచు పాడిన పాటలను మీరు పాడు

చుండుడు, అందుచే ప్రజాసేవ చక్కగా చేయుశక్తి మీకు లభించును.''

* * *

ప్రజాసేవ చేయ సమకట్టిన ప్రతి దేశాభిమానియు శ్రీరామకృష్ణుడు చేసిన యీ ముఖ్యబోధను గమనింపవలెను. ప్రజాసేవ చేయవలెననెడి అమితమగు కోరికతో, చేయవలసిన పనులను వెదకుచు 'ఇది చేయుదుము, అది చేయుదుము' అని తిరుగకుడు. మీ చేతికందిన పనిని మొదట చేయుచుండుడు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుటకై యీ పనికంటె ఆ పని శ్రేష్ఠమని చెప్పుచు తిరుగవలదు. సంఘమునకు సేవ చేయుట అనగా కీర్తి, లాభముల నపేక్షింపకుండుటయు, మీ ధర్మముల నిర్వర్తించుటయు అని అర్థము. భక్తికొఱకును, నిశ్చలహృదయముతో సేవ చేయు బుద్ధికొఱకును ఏకాగ్రతతో ప్రార్థింపుడు.

* * *

దేశమునకు సేవ పలువిధముల చేయవచ్చును. సంఘమునకు సేవ చేయుట మంచి దేశాని కీర్తి సంపాదింపవలెనను దురాశతో దానిని ప్రారంభింపరాదు. పేరు సంపాదింపవలెనను కాంక్ష క్లిష్టసమయములు వచ్చినపుడు ప్రజాసేవకుల ప్రయత్నములను తారుమారుచేయును. యశస్సంపాదన కాంక్షగాని, మఱి యితర స్వార్థపరత్వముగాని హృదయములో స్పష్టముగానైనను, ప్రచ్ఛన్నముగానైనను ఉండె

నేని, యెంత ఉత్తమ ప్రయత్నములైనను నిష్ప్రయోజనములు కాగలవు.

'నే నితరుల నిమిత్తమెంతయో కష్టించితినిగాని నా కేమియు లాభము చేకూరలేదు' అని యెందరో దేశాభిమానులు మొరపెట్టుట మనము వినమా! ఇట్టి చింతకును, మనస్సులోని అసంతృప్తికిని, కారణమేమి? ఫలాపేక్షతో పనిచేసి ఆ ఫలమును పొందకయుండుటయే. పేరుప్రతిష్ఠలు సంపాదించుటకై దేశమునకుగాని, సంఘమునకుగాని సేవ చేయ ప్రారంభించువారు ఆపదలపాలగుదురు. ఇట్టి యపవిత్రమయిన యుద్దేశము ఎట్టి మంచిపనినైనను పాడుచేయును. ఒకరి లాభము నిమిత్తముగాని, సంఘసేవకొఱకుగాని మన మెట్టి మంచిచేసినను దానిని మనము దేవుని కర్పించి అతని కరుణను నమ్ముకొనియుండవలెను. ఇటులచేసితిమేని జయము చేకూరినపుడు పొంగిపోవుటయును, అపజయము చేకూరినపుడు క్రుంగిపోవుటయును కలుగవు.

స్వలాభము నిమిత్తమును, కీర్తి సంపాదింపవలెనను కోరికతోను చేయునది నిజమైనసేవ కానేరదు. అది యొక విధమయిన వ్యాపారము. దేశమునకు సేవచేసిన గొప్ప దేశాభిమానులు పేరుప్రతిష్ఠలు పొందినది వాస్తవమే. కాని ఆ జగద్విదిత పురుషులు ప్రతిష్ఠకొఱకు పెనుగులాడ లేదు. వారికి లభించిన జయవిఖ్యాతులలోగల రహస్యమేమన ప్రతిష్ఠనాశింపక పనిచేయుటయే. ఈ నిజమును మఱచి అట్టి కీర్తిని తాముకూడ సంపాదింపవలెనను ఆశతో

పాటుపడినవారు తఱచుగా ఆశాభంగశోకము నొందుట మనము చూచియున్నాము.

*           *           *

కీర్తిప్రతిఫలముల నాశింపక ప్రజాసేవ యెట్లు చేయ నగునని కొందఱు ప్రశ్నింపవచ్చును. అట్టి సందిగ్ధమన స్కులు తమ గృహధర్మములనుమాత్రమే నిర్వర్తించుచు న్యాయబుద్ధితో నడచుకొనినచో, సంఘసేవచేసినవారే యగుదురు. అట్టివారు ప్రజాసేవచేయ సమకట్టక, అందుచే కలుగు విచారము, విసుగు తప్పించుకొనవచ్చును.

ఆసక్తి, వాంఛ లేకుండ ప్రజాసేవచేయుట కష్టము. అందులకే శ్రీరామకృష్ణుడు ఇటులనెను. "ప్రజాసేవలో చొరబడుటకు ముందు భగవత్కటాక్షమును సంపాదింపుడు. 'ఓ ప్రభూ! నా హృదయమును భక్తితో పూరింపుము' అని మొదట ప్రార్థింపుడు."

ప్రజాసేవలో నిమగ్నులగువారలకు శ్రీరామకృష్ణు డొసగిన యీ హెచ్చరిక చాల ముఖ్యమయినది. తాము పడిన కష్టము, వ్యయపఱచిన ధనము వృథాయయినదని చాలమంది విషాదపూరితులగుచున్నారు. దీని రహస్యము వారు ప్రారంభమున అవలంబించిన మనోదృష్టి తప్పుగా నుండుటే. పాలకుండలో నొక మజ్జిగ చుక్కపడి యేరీతిగా ఆ పాల నన్నిటిని పెరుగుగ మార్చునో ఆ తప్పుయొక్క మహిమయు అట్టిదే. పేరుప్రతిష్ఠలు పునాదిగా నిర్మింపబడిన సౌధముయొక్క గతి మఱి యెట్లు వేఱగును? అది తప్పక

పతన మొంది విచారమును గలిగించును. అందులకే "మీరు ప్రజాసేవకై నడుముకట్టుటకు ముందు భగవంతుని ప్రార్థింపుడు. భక్తి యను ఉపకరముచే మీ మనస్సును శుభ్ర పఱచుకొనుడు. తదుపరి పనిని ప్రారంభింపుడు. పునాది గట్టిదియు సుస్థిరమయినదియు నయినచో నేరీతిగ నిర్మించి నను కట్టడము సురక్షితముగనే యుండును" అని శ్రీరామ కృష్ణుడు నుడివెను.

శస్త్రచికిత్స మొదలిడుటకు ముందు వైద్యులేమి చేయుదురు? వారి చేతులూ, కత్తులు శుభ్రముగా మందు లచే కడిగి కత్తిని ప్రయోగింతురు. అట్లే ప్రజాసేవ చేయ నుద్యమించినవారు ముందుగా తమ మనస్సును శుభ్రపఱచు కొనవలెను. అపుడీశ్వరకృపచే నంతయు సక్రమముగా నుండును. చేయు కృషి సాఫల్యమొందుటకును మన శ్శాంతి బడయుటకును, వేఱొండు ఉపాయము లేదు. భగ వంతునియెడ పరిపూర్ణ శరణాగతభావమును, అతని అనన్య ప్రాభవజ్ఞానమును, సాధించుటకు మంత్రములు జపించుట చాలదు. కేవల శుష్క కర్మకలాపము నిష్ప్రయోజనము. హృదయమునందు భక్తి దీపింపవలెను. దానికి తరువాతనే యేవిధమయిన ప్రజాసేవయయినను ప్రారంభింపనగును. దైవముయొక్క తోడ్పాటు నాశింపక ప్రారంభింపబడు ఏ కార్యమయినను అసత్యమయినదియు, మోసమయి నదియు అగును. దుఃఖమును, కోపమును, ఈర్ష్యను జనింప జేయును.

ప్రజాసేవ చేయ మొదలిడినపుడుమాత్రమే భగవంతుని తలంచి పూజించుట చాలదు. శ్రీరామకృష్ణ భగవానుడు ఉపదేశించినటుల మనము పనిచేయుచున్నంతకాలము కూడ మనసులో భగవంతునియందు తలంపు దృఢముగ నిల్పి పనిచేయవలెను.

సంఘసేవ, భగవంతునిపూజ, యీ రెండును వేఱని యెంచుట తప్పు. అన్నికర్మలు భగవంతుని యుపాసనయే యని చేయవలెను. భగవంతునిమీది తలంపు, చేయబడు కర్మకు పరోధము కాదు. భగవంతునిమీది భక్తితో కర్మముచేయు నభ్యాసము మన కెక్కువ యానందమును కలిగించును. పనిచేయుటకు మనకది నిపుణతను, ఉత్సాహము నిచ్చును. గాంధిమహాత్మునికి విజయము కలుగుటలో గల రహస్యమిదియే యని నేను నిస్సందేహముగా చెప్పగలను. ఏ పనిచేసినను, ఏ పదకమును సంకల్పించినను, ఏ పూనిక నుపక్రమించినను, భగవచ్చింతనము—నడచువాని వెంట నీడ చనునట్లు—అతని హృదయమున ఎప్పుడును నిలిచి అనుసరించుచుండెను. ఈ తలంపు అతని పనికి అంతరాయమును కలుగ జేయుటకు మారుగా, విజయమునకే ఆధారమగుచుండెను. మనము చేయగల చిన్నపనులందు సైతము ఈ భగవచ్చింతనము అదేరీతిగ మనప్రక్కన నీడవలె నిలిచి మనకు గుప్తముగా తోడ్పడును. సంఘసేవకుడు ఎడతెగక భగవచ్చింతన మనస్సులో నుంచుకొనియే కృషిసల్పుట ముఖ్యావసరము. క్రిమిఘ్నపదార్థము లేకుండుట శస్త్రచికిత్సా

విజయమున కెట్లు అవసరమో అట్లే ఫలప్రదమగు కర్మకు ఈ నిరంతర భగవచ్చింతనము అవసరము. నిర్మలమైన మనస్సు మహానిధివంటిదే కాక అమోఘమగు సాధనకూడ. దానిని బడయుటకు మార్గము భక్తి యొకటియే.

## 15. అద్వైతము

ఒక సమయమున నొక యద్వైతి పరమహంస రొద్దకువచ్చి "అద్వైతమునుగూర్చి తమ యభిప్రాయము తెలుపుడు" అని కోరుచు, 'బ్రహ్మ మొక్కటియే సత్యము. ఇంద్రియగోచరజగత్తు మిథ్య: ఇదియేకదా వేదాంతము యొక్క వాస్తవసిద్ధాంతము?' అని యడిగెను.

"మనల నావరించియుండు ప్రపంచము మిథ్య యనియు, అదియంతయు మాయయనియు, పరబ్రహ్మము మాత్రమే సత్యమనియు వాదించి రుజువుచేయుట సులభమే. కాని బ్రహ్మమొక్కడే సత్యమని తార్కికముగ రుజువు పఱచుట చాలదు. బ్రహ్మమును అనుభవవేద్యము చేసికొనుటయు, ప్రత్యక్షపఱచుకొనుటయు అవసరము. తర్కముచే లభించిన జ్ఞానమునకును, పారమార్థికానుభవమునకును, హస్తిమశకాంతరభేదము కలదు. దూరమున నుండునవి యెండమావులే యని మనకు తెలిసినపుడు మన మందుండి యొక కుండనీళ్లు సేకరింప యత్నింపము. అచటకు నీటికొఱకు వెళ్లుమని చెప్పువారిని మనము పరిహాసింతుము. జలముగా మనకు గోచరించినది మాయయే యని మనకు తెలిసినపుడు

అందుల కానుగుణ్యముగ నడచుకొందుము. మనకు కానిపించునవి ఎండమావులే అను జ్ఞానముపై ఆ ఎండమావుల యెడ మన ప్రవర్తనము ఆధారపడి యుండును.

"కాని అద్వైతసత్యవిషయమున నిది వర్తింపదు. పరబ్రహ్మము మాత్రమే సత్యమనియు, జీవరాసులును మన చుట్టు నుండు ప్రపంచములోగల పలు వస్తువులును మాయ యనియు తర్కవాదముచేత మనము తీర్మానింతుము. అయినను ఆ సిద్ధాంతము మన హృదయమును, మనస్సును, జొచ్చి వానిని మార్పదు. బుద్ధిబలముచే మనము చేసిన సిద్ధాంతము ప్రత్యేకముగా నిల్చియుండునేగాని, మన జీవితములోనికి జొచ్చి దాని వైఖరిని మార్పదు. అది యింకను మన హృదయాంతరాళగర్భములో చేరిపోలేదు. పాండిత్యప్రకర్ష మూలముననను వాగ్వాదప్రాబల్య మూలముననను మన మేర్పఱచుకొన్న సిద్ధాంతము గాడిదె వీపుమీది బరువువలె మనలో ప్రత్యేకముగ నిలిచియుండును. అది మన జీవితములోని కెక్కదు. అదేమి చిత్రమో కాని, మాయావాదము ననుసరించునట్లు చెప్పకొనువారు ప్రతిదినమునకును అవసరమగు ఆహారముకొఱకును, బట్టలకొఱకును ఎక్కువ 'ఆదుర్దా' పడుచు ప్రాకులాడుచునే యుందురు. ఒక్కొక్క చిన్న విషయమునకు మనము కలవరపడి సులభముగా కోపము చెందుదుము. సత్యమును గురించిన మన పుస్తకజ్ఞానము మన నడతను ఎంతమాత్రము మార్పలేదు. అద్వైతానుసంధానము అంత సులభమైనది కాదు. దానికి క్రమశిక్షణ,

ఉపాసన అవసరము. ఒక పామునుగాని, ఒక పులినిగాని చూచినపుడు భయముచేత వణకుదుము. ఇంద్రియముల ద్వారా ఇట్లు గలిగిన జ్ఞానము శరీరము నంతటిని కంపింప జేయును. ఆకలిచెందిన వానికి రుచికరమగు అన్నమును చూచినపుడు నోరూరును. అన్నదర్శనము మన మనశ్శరీరములపై తన ప్రభావమును చూపును.

"ఒక ప్రియస్నేహితుని గాని యొక ఆప్తబాంధవుని గాని కలసికొనినపుడు వానిని గుర్తించుటతో తృప్తిపడి మన మూరక యుండము. మనము హృదయములో నానందోద్రేకమును పొందుదుము.

"తర్కశాస్త్ర మార్గమునే ఆధారము చేసికొని అద్వైత సిద్ధాంతము చెల్లదగినదని నొక్కి వక్కాణించుట వలన ప్రయోజనము లేదు. ఒక సర్పముయొక్కగాని, యొక పులియొక్కగాని, బొమ్మను చూచినపుడు భయపడ లేదని గర్వించుట కెంత ఆధారముగలదో అంతే దీనికిని ఆధారము.

"ఒక వ్యక్తి నిజముగా అద్వైతజ్ఞానమును పొందె నేని, అతడా క్షణముననే పరమసత్యముతో ఐక్యభావము పొందవలదా! అడవిలో నిజమయిన పులిని చూచినపుడు మనుష్యు డేరీతిగ భయముచే కంపించునో, యట్లే నిజమగు అద్వైతసిద్ధిని బడసిన తత్క్షణముననే యతడు మితిలేని యానందమును పొంది పరబ్రహ్మములో లీనుడై సమాధ్యవస్థను పొంది తీరవలెను. బ్రహ్మ మొక్కడే సత్యమనియు,

తదితరమంతయు మిథ్యయనియు ఒక వ్యక్తి కనుగొనినచో భేదబుద్ధికి తావెక్కడిది? భేదబుద్ధి యంతరింపనిచో ఈ సత్యముయొక్క జ్ఞానము అతి మందమనియే చెప్పవలెను. అది యనుభవసిద్ధమయిన జ్ఞానము కాదు.''

అద్వైతసిద్ధి నిజముగా లభించినచో మిథ్యారూపమగు భేదబుద్ధి, మండిపోయిన కర్పూరము మాడ్కి, జాడయే లేకుండ అంతరింపవలెను. 'నేను నన్ను దహించుకొంటి'నని తెల్పు బూడిదయైనను మిగులదు. ఆనందావస్థ పొందిన యతనికి మాయ మాయగను, సత్యము సత్యముగను కాన్పించుచుండును. కాని, అట్టి యవస్థయందు 'నీవు', 'అది', 'ఇది', 'జ్ఞానము', 'అజ్ఞానము', 'సత్యము', 'న-ఇతి' మొదలగు భేదములకు తావే లేదు. అట్టి పురుషుని జీవితము అపారమును, నిశ్శబ్దమును అగు కాలప్రవాహములో లీనమైపోవును. ఉప్పుతో చేయబడిన బొమ్మ నీళ్లలో కరగిపోవు రీతి అద్వైతసిద్ధి పొందినవాని జీవాత్మ పరమాత్మయను ప్రవాహములో లీనమగును. నీళ్లలో కరగిన యుప్పు తానొందిన ద్రవీకరణ క్రియను గూర్చి మాటలాడగలదా? ఎవ్వరైనను 'నాకు తెలియును', 'నాకు తెలియదు' అను విధముగ భాషించినపుడు, ఆ భాషణము యావత్తు 'నేను', 'నీవు' అను భేదబుద్ధితో కూడియున్నది. అహంకారము వదలక యుండునంతవఱకు ప్రపంచము అట్టివానికి మిథ్య యేలాగున అగును? భేదబుద్ధి యంతరించినపుడు వాదోపవాదములకిక అవకాశమే ఉండదు. అంతయు నిశ్శబ్దమయము.

బుద్ధిచేమాత్రమే గ్రహింప వీలుకాని సత్యమును మాయాక్షేత్రములో తేటతెల్లము జేయవలసి వచ్చుటయే అద్వైతమును బోధింపజూచుటలోగల పెద్దచిక్కు. ప్రబోధము చేయు గురువునకును, వినునట్టి శిష్యునకును కూడ 'నీవు, నేను' అను పలుకులచే సూచింపబడు భేదబుద్ధి నిలిచియే యుండును. ఇరువురకును సృష్టి అన్నివిధముల సత్యమని తోచును. సమాధిస్థితియందు లభించు అపరోక్షానుభూతిచే మాత్రమే అద్వైతము బోధపడును. ఎట్టి యితరావస్థయందుగాని అద్వైతమును గురించిన మాటలు గాలితో నిండిన సంచివలె నుండును. దానిని కొంచెము చూచాయగ గ్రహించుట మాత్రము సాధ్యము. భగవంతుని ఈ జ్ఞానముతో ఉపాసించిన యెడల సత్యము అనుభవవేద్యము కావచ్చును.

## 16. విగ్రహరూప అవతారములు

గృహనిర్మాణమును ప్రారంభించుటకు ముందు పనివారు మొదట నొక పరంజా కట్టుదురు. దానిమీద నిలబడి యిల్లు కట్టుదురు. నిర్మాణము పూర్తియయిన పిమ్మట పరంజా అనవసరము గనుక దానిని తీసివేయుదురు. ఇమ్మాడ్కి పరిపక్వమయిన విజ్ఞానము గలవారికి గుళ్లు, (అందలి) కోనేరులు అనవసరములు. చిత్తమును ఏకాగ్రము చేసి దానిని చెదరకుండ పట్టలేనివారికే గుళ్లలో పూజలు, పుణ్యోదకస్నానములు అవసరములు.

భక్తిపూర్వకముగ లింగాకారమును మృత్తికతో కల్పించినయెడల అది ఈశ్వరుడే అగును. సర్వవ్యాపియగు ఈశ్వరు డా లింగములో నుండక పోడు.

*　　　*　　　*

'ఈ విగ్రహము మృత్తికామాత్రము, మనము దానిని భగవంతునిగా భావింపరాదు' అని యొకానొక సమయమున నొక మనుష్యు డనెను.

"నీవు దానిని మృత్తికయని గాని, శిలయని గాని, రాగియని గాని యెందుల కనెదవు? అందులో భగవంతుని రూపమును నీవేల తిలకింపవు? ఈశ్వరు డన్నిటియందున్నాడు గదా, అన్నియు ఈశ్వరునియందున్నవి గదా, అట్టిచో మరి యే యితరమువలె ఈ రూపముకూడ భగవంతుని పూజించుట కుపయోగపడదా? మృత్తికతో చేయబడిన విగ్రహము దేవుడు. రాగితో చేయబడిన విగ్రహము కూడ దేవుడు. భగవంతుడు కానిది యేదియు లేదు. చివరకొక నీటిబొట్టు సైతము పరాశక్తి రూపమే. మనము త్రాగెడు జలము కూడ పరాశక్తియే. లోపల ప్రవేశించి మన దప్పిని శమింప జేయునదియు పరాశక్తియే. తులసిమాలతో హరినామ స్మరణ చేసితిమేని ప్రతి పూసయు హరి స్వరూపమే.

ఆకసమందలి మబ్బులోను, పిడుగులోను, మెరుపులోను పరాశక్తి వాసము చేయును. మబ్బు వర్షముగా నొక పర్వతముపై పడి, యొక మహానదిగా భూమిమీద ప్రవహించినపుడు ఆ నదిలో కూడ పరాశక్తి వసించును. ఉష

కాలమునందును, సాయంసంధ్యాకాలమునందును భక్తులా జలము నీ మాటలతో నర్చింతురు: 'ఓ గంగాదేవీ! నీ సంతోషము మమ్ములనుగూడ సంతోషపూరితులను జేయుగావుత! నీ శక్తి మమ్ములను శక్తిమంతులను జేయుగావుత! ఓ యుదకమా! నా నేత్రములను ప్రకాశవంతములుగ జేసి, నా దృష్టిని విశాలమగునట్లు చేయుము. తల్లి తన యనుగు బిడ్డకు నిర్మల ప్రీతితో అన్నమిడునట్లు నీ మాధుర్యము నాకు పుష్టినిచ్చుగాక. ఓ యుదకమా! నీ వన్నిటిని పరిశుద్ధపఱచి, శుష్కించి యదృశ్య మయ్యెదవు. ఆ సుగుణమును, ఆ పరిశుద్ధతను నాకు కలుగునట్లు చేయుము. నా ప్రార్థన యిదియే.' ఈ మాటలతో భక్తులు తమ శిరస్సులపై నీళ్లను ప్రోక్షణ చేసికొని చేతిలో నీళ్లను తీసికొని 'ఓ యక్షరమయిన మహాదేవీ! నీకు మ్రొక్కెదను' అని చెప్పుచు ఆచమనము చేయుదురు. ఆ జలముకూడ పరాశక్తియే.

*　　　*　　　*

సర్వత్ర ఈశ్వరుడుకలడని మనము నిజముగ విశ్వసించినయెడల, చిత్త మేకాగ్రతనొందుసాధనముగ ఒక భగవద్రూపమును మన మేల అర్చింపరాదు? సర్వగతుడగు భగవంతు డా రూపములో నుండడా? విగ్రహారాధనమందాసక్తిలేని వారొక విగ్రహమును పూజింపవలెనని నిర్బంధము లేదు. కాని, విగ్రహారాధన చేయువారి నాక్షేపింప ను. భగవంతుడు సర్వగతుడు. పరాశక్తి యన్నిటియందు ను. మనము భుజించు అన్నముమెతుకును కూడ మనము

పూజింపవచ్చును. అన్నమును మన ముపాసించిన పిదప భుజించితిమేని పరాశక్తి మనలోనుండి ఆశీర్వదించును.

*     *     *

మనము పూజించు విగ్రహము కేవలము సాంకేతిక మయినదికాదు. అంతటనుగల భగవంతుడు అందులోకూడ నిజముగ గలడు. పూజింపబడుమూర్తిని మనపెద్దలు విగ్రహరూపమునుపొందిన అవతారముగ భావించువారు. అవి రామునివంటి కృష్ణునివంటి శాశ్వతావతారములు. రాయిగను, మత్స్యముగను, వరాహముగను, దశరథ పుత్రుడుగను భగవంతు డవతరించెను. ఆ ప్రకారముగనే శ్రీరంగ దేవాలయములోని విగ్రహమునందును, తదితర పుణ్యక్షేత్ర దేవాలయములలోను అత డవతరించుచుండును. మన భక్తికి ఫలితముగా ఈ రూపమున అవతరించును. ఆళ్వారులును, నాయనమారులును, ఆచార్యులును, వారి వేదాంతసిద్ధిమూలమున భగవంతుని ఆ పవిత్రమైన దేవా లయములలో ముఖాముఖ దర్శించిరి. అచట నతనిని కను గొని, అతనిపై చిత్తము నేకాగ్రముచేసి అతనిని ధ్యానించి అతని సంకీర్తనజేసి యానందములో నృత్యము చేసిరి.

రామానుజులవారిని గురించి యొక కథ గలదు. ఒకప్పుడు కొందరు పిల్లలు వీధిలో నాడుచుండిరి. వారు భూమిమీద శ్రీరంగ దేవాలయమును చిత్రించి యందులో శేషశాయియగు శ్రీరంగనాథుని రూపమును వ్రాసిరి. భిక్షాటనమునకై రామానుజులవారు నిత్యము తాముచేయు

సంచారములో దీనిని చూచిరి. తత్క్షణమే యతడా చిత్రము నొద్ద సాష్టాంగ నమస్కారపూర్వకముగ బడి ధ్యానములో తన్మయుడయ్యెను. మనము నిర్మించు విగ్రహములలోను రంగులతో చిత్రించు పటములలోను దేవు డుండడనుట అజ్ఞానమూలకము.

పరబ్రహ్మము చేతనాచేతనములలో నుండునని మన మెప్పుడు తెలిసికొందుమో యప్పుడు ప్రతిష్ఠింపబడిన విగ్రహములు పరమాత్మస్వరూపములని యెంచుటలో కష్ట మేమియునుండదు. అన్యథా తలచువారు పరబ్రహ్మమును పరిమితునొనర్చి అతని నింకొక ప్రపంచమువానినిగ చేయుదురు. బహుశః భగవంతుని సర్వాంతర్యామిత్వమున వారికి కొంచెమయినను నమ్మకము లేకపోవచ్చును. పరబ్రహ్మమును గురించి మనస్సులో తలంచుట మూలమున, ధ్యానించుట మూలమున, అతనిని పూజింపవచ్చును. అయిన నిది యందఱకును సాధ్యమయినది కాదు. సులభమని తోచినచో అది కేవల మపోహాయే. జడరూపమగు లింగములో నున్న సర్వాంతర్యామి నుపాసించుట యందఱకును అందు బాటులోనున్నది.

ఈ విధమగు సేవను నిరసించుట తప్పు. శ్రీరామకృష్ణభగవానుడు, ఆచార్యులయిన శంకరులు, రామానుజులు, మధ్వాచార్యులు, క్రైస్తవద్రష్టలు, మహాపురుషులు వీరందరును విగ్రహములలో ఇమిడిన యవతారములనే యుపాసించి శాంతిని, ఆనందమును పొందిరను సంగతి

బాగుగా తెలిసిన విషయమే. అట్లే మనముకూడ జడమగు నొక రాతినిగాని, వృక్షమునుగాని మన పూజకేర్పరచు కొని భగవంతుని ధ్యానించి యెక్కువ లాభమును పొంద వచ్చును.

## 17. "భజగోవిందమ్"

'నిద్రపో నాయనా! నిద్రపో' యని తల్లి యనును. 'అమ్మా! నేను నిద్రపోతిని' అని బిడ్డ బదులుచెప్పును. ఆ పసిబిడ్డ తన తల్లియందలి ప్రేమచే ఇట్లనును. నిద్ర యనగా నేమియో ఆ బిడ్డకు తెలియదు. పుస్తకములద్వారానే సంపాదించిన విద్యగల యతడు ఈ బిడ్డవలెనే పలుకును. సమాధ్యవస్థపొందకయే "శివోఽహమ్, శివోఽహమ్" ('నేను శివుడను, నేను శివుడను') అని అతడు చెప్పును. బిడ్డ నిజముగా నిద్రించియుండిన 'నేను నిద్రించితి'నని యెటుల చెప్పగలడు.

అహంకారము చేతిలో చిక్కియున్నవాడు, తన కహంకారములేదని ఎంతగా చెప్పినను నిర్గుణ బ్రహ్మ మతనికి తోడ్పడజాలదు. పరబ్రహ్మము భగవంతుడుగను, సృష్టి యావత్తు అతని లీలగను, తలంచి భక్తిమార్గము నవలంబించుట యొకటియే అట్టివాని కుచితము. ఇట్లొనరించిన ఆత్మ పరిపక్వమై, కాలము నిండినపు డది తొడిమనుండి వదలి రాలిపోవును. జ్ఞానికానివాడు తాను జ్ఞానియని తలంచుట నిష్ప్రయోజనము.

ఒక యద్వైతవిద్వాంసుని సమక్షమున పరమహంస తన్ను గూర్చి ఇట్లు వినయముతో నుడివెను. "నా యహంకారము నాకు 'నేను' అను వికారమును కలుగచేయుచుండునంతవరకు నాలోని బ్రహ్మము సగుణబ్రహ్మమే. భగవంతుని గురించి ధ్యానించి పూజించినందువలన కీడేమి? నేను దేవి నుపాసింతును. వివిధ జీవులుగను, సృష్టియందలి వస్తువులుగను ఆమె నాకు సాక్షాత్కరించును. భగవతియును, ఈశ్వరుడును అభిన్నులు. తన కాంతినుండి వజ్రమును, తన కిరణములనుండి సూర్యుదును వేరా? వీనిలో ఒకదానిని చూడకుండ మఱియొకదానిని నీవు చూడజాలవు. నేను పూజించు దేవి అద్వితీయమైన బ్రహ్మమే.

'శివో౽హమ్' అని పలుకుటచే ప్రయోజనము లేదు. భక్తిచే నహంకారము పూర్తిగా నశించినపుడే యట్టి జ్ఞానము గలుగును. అంతవఱకు 'నేను భగవంతుడను' అనునది నిజముకాదు. నిజ మేమనగా 'నేను భగవంతుని దాసుడను', 'అతని యాజ్ఞను నెరవేర్చువాడను' అనుట.

* * *

ఒక యాత్రాస్థలమున నొకానొకప్పు డొక సాధువు అద్వైతమును గురించి యెక్కువగా ప్రసంగించుచుండెను. అతనిని గుఱించి యొక యపవాదమును రామకృష్ణుడు వినియుండెను. అతడు సాధువునొద్దకు జని 'నీవు వేదాంత రహస్యముల నత్యద్భుతముగా విశదపఱచుచున్నావు. కాని

నిన్ను గురించి యేవియో గుసగుసలు బయలుదేరినవి. అందు నిజమేమి?' యని ప్రశ్నించెను.

"ఓ! దానికేమి? నీడ నీడతో క్రీడించిన వేదాంతి కేమి పట్టినది? ప్రపంచమంతయు మిథ్య. ప్రపంచమే యసత్యమయినపుడు నా శరీరముచేసిన కామకృత్యములు మాత్రము నిజములగునా? ఇదంతయు నెండమావులే, వేదాంతజ్ఞానముగల నీవు దానికై కలవరపడనేల?"

శ్రీరామకృష్ణుడు దీనిని వినినంతనే అసహ్యాపడి యిట్లనెను: "నీ వేదాంతజ్ఞానమును మంట గలుపుము. నీ పాండిత్యమే పెద్ద వలయై నిన్ను బంధించుచున్నది. తెలివి మాలినవారిని మోసగించి నీ శరీరమును సుఖపెట్టుకొనుచున్నావు." భక్తిలేనివారు ప్రపంచము మిథ్య యనుట అపాయకరమైన విషయము.

*                *                *

'నాలో భగవంతుడున్నాడు. నేను చేయురీతిని చేయుటకు ప్రేరణచేయునది యతడే. నా కెట్టి పూచియు లేదు. నీవు నన్నందులకు నిందించెద'వని దుర్యోధనుడును ఒకానొకప్పుడు నుడివెను.

తాను నిజముగ భగవంతుని దాసుడనియు, తాను చేయు ప్రతికర్మయు ఈశ్వరేచ్ఛానుకూలమే యనియు నమ్మువాడు ఎట్లు పాపము చేయగలడు? పాపము తలంపే అతనిలో ప్రవేశించి కళంకము కలిగింపదు. బాగుగా నృత్యము అభ్యసించిన నటి ఎప్పుడైనను తప్పటడుగు వేయునా? అప్రయత్నము

గనే తమంతటతామే ఆమె పాదములు శాశబద్ధముగపడును. 'నేను దేవుని అధీనుడను, ప్రతియొకటియు అతనియొక్క విధియే' యను పవిత్ర భావము ఎవని హృదయమును దృఢముగ నావరించునో అట్టివానిని ఎట్టి మాలిన్యమును చేరదు. ఇది మఱచి చదువుకొనిన మూఢులు తమ దురాశయముల కనువుగ శాస్త్రవాక్యముల నుదాహరింతురు. 'ప్రపంచమంతయు మిథ్య అందుచే ఇంద్రియ సౌఖ్యములను చవిచూచిన తప్పులేదు' అనియు వాదింతురు. వారిని వారే మోసము చేసికొందురు. అద్వైతమును గుఱించి యిట్టి మాటలు మాని, అద్వైతసిద్ధి నొందజాలనివారు ఆ మార్గమునకన్న సులభమగు భక్తిమార్గము నవలంబించుట మేలు. ఉపనిషత్తులందును, బ్రహ్మసూత్రములందును గల వేదాంత విద్యకు ప్రధానాచార్యులగు శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారే తమ యద్భుత మేధాశక్తిని వినియోగించి "భజగోవిందమ్ భజగోవిందమ్ మూఢమతే" (ఓ మూఢమతీ! గోవిందుని కీర్తింపుము, గోవిందుని ప్రార్థింపుము) అని కీర్తించి యుండెననగా మన మెంతటి వారలము?

## 18. సంఘ సంస్కరణ

మనము చేయు పూజా విధానములలోను మన జీవన మార్గములలోను అనేకులగు గొప్ప సంస్కర్తలు అప్పుడప్పుడు మార్పులను గావించిరి. కాని వారి బోధల ఫలితముగా క్రొత్త యాచారములును నూతన వర్ణభేదములునే జనించి

నవి. ఇందుచేత మనుష్యులలో సంస్కరణ జరుగలేదు. కాని క్రొత్తముఠాలుగా చీలుట ఏర్పడినది. అత్యంత సదుద్దేశములచే ప్రేరేపింపబడిన సంస్కరణలుకూడ దురదృష్ట వశమున భిన్నతకును, అహంకారమునకును, పరస్పర వైషమ్యమునకును, అనైకమత్యమునకును కారణమయ్యెను. మన సంఘసంస్కరణ ప్రయత్నముల శాశ్వత ఫలితముగ మన సంఘములో తారతమ్యములే ఏర్పడినవి.

రామకృష్ణ భగవానుని బోధలలోను, చర్యలలోను ఈ దోషము ఏమాత్రము లేదు. ఏ పూజావిధానమందేమి, యే సంఘాచారమునందేమి యతడెట్టి తప్పు పట్టలేదు. అంతటను ఆయన ఆ ఒకే బ్రహ్మమును చూడగలిగెను; ప్రతిదానియందును మంచియే ఆయనకు కనబడుచుండెను. ఆయన బోధనామృతముచే మనుష్యులు బాగుపడిరి. ఆయన మూలమున మన దేశములో ఏ క్రొత్త యాచారము జనింపలేదు.

రామకృష్ణ భగవానుడు మహాజ్ఞాని యయినప్పటికిని విగ్రహారాధనకు వ్యతిరేకముగా మాటలాడలేదు. ఆయన సమాధిస్థితిలో పరబ్రహ్మము యొక్క ప్రత్యక్షానుభూతి నొందిన అద్వైత జ్ఞాననిధి. అయినప్పటికిని ఆయన క్రింది మెట్టులోనిదగు పూజావిధానాదికమును నీచభావముతో చూడలేదు. ప్రతి దేవతకుచేయుబడు ప్రతి పూజావిధానమును ఆయన సమానముగా గౌరవించెను. ఈ విశాలదృష్టి కానుగుణ్యముగ ఆయన పలుకుచుండెను.

అత్యున్నతజ్ఞానముతో పాటు వివిధ కర్మకలాపములు, పండుగలు, మంత్రములు, పూజావిధానములు కూడ హిందూమతములో నుండుటను గురించి ఒకప్పుడు మాటలాడుచు ఆయన యిటుల నుడివెను: "వడ్లగింజలో ప్రధానమయినది అందులో నున్న బియ్యపు గింజ. మనము ఊకను తీసి బియ్యమును పచనము చేసికొందుము. అయినను, బియ్యము చాల కాలము నిల్వయుండవు. అవి ముగ్గిపోవును. వడ్లుగానే ఉన్న యెడల చాలకాలముండును. భూమిలో నాటినప్పుడు మొలవగలిగినది వడ్లగింజయే. మొలచునది బియ్యపు గింజయే అయినను దానిని ఊకతో గూడ వడ్లగింజగానే పాతిపెట్టవలెను. మన ధర్మమును పోషించి అది సుస్థిరముగ నాటుకొని వృద్ధి నొందుటకు వలయు జీవశక్తిని కలిగించుట కొఱకే కర్మలు, వ్రతములు, పండుగలు నియమించుట. కర్మలు బియ్యమును కప్పిన ఊకవంటివి. భుజించుట కవసరమైనపుడు బియ్యముపై గల ఊకను తీసివేయుదుము. జ్ఞానసిద్ధునకు కర్మలు, పండుగలు, కోవెలలు అనవసరములు. కాని, హిందూమతము ప్రకారము భగవంతుని చేరు సాధనముగ జ్ఞానమార్గము మాత్రమే ఉపదేశించి కర్మలను బహిష్కరించితిమేని, అది వేర్లు పారి పెరుగనేరదు. బియ్యపు గింజ భూమిలో చల్లినచో నెటుల క్రుళ్లి నశించునో అదే రీతిగ నదియు నశించును.

"మనకు గాయము తగిలినప్పుడు త్వరలోనే పక్కు కట్టునుగదా! గాయము లోపలిభాగము మానువఱకును ఆ

పక్కు దానిని కాపాడుచుండును. పచ్చిగానున్న గాయము మానువఱకు ఆ పక్కు ఉండుట అవసరము. తరువాత అది యెండి తనంతట తానే రాలిపోవును. జ్ఞాన ముదయించిన పిమ్మట కర్మలు, క్రతువులు వానియంతటవియే అంతరించిపోవును. జ్ఞానము గలుగుటకు ముందే వానిని మానుట గాయము కుదురకముందే పక్కును ఒలిచివేయుట వంటిది. అది గాయము మానుటను అడ్డగించుటయే అగును.''

కొందఱు జ్ఞానులు కర్మనియతులను లక్ష్యము సేయుట యనవసరమని తలంతురు కాని బుద్ధి పరిపక్వము కానిదే వానిని విడుచుట సరికాదు. పూర్తిగా ఎదిగి స్వభావ సిద్ధముగా పరిపక్వమయిన ఫలముయొక్క తియ్యదనము, ''పచ్చికాయ తెచ్చి పడవేయ'' నుండదు.

జ్ఞానులకు వర్ణ భేదము లుండవు. జ్ఞానముయొక్క ఫలితముగా నిది వారు సంపాదించిన స్వేచ్ఛ. ఈ స్వాతంత్ర్యము వారేరీతిగ నుపయోగింతురో తెలుపుటకు శ్రీరామకృష్ణు డీ కథను నుడివెను :

ఒకప్పుడు కృష్ణకిశోరుడు బృందావనమునకు యాత్ర వెడలెను. బహుదూరము నడుచుటచే నతడు దప్పిగొని యొక నూతియొద్ద నిలిచెను. ఒక మనుష్యుడొక కుండతో నూతిలోని నీళ్లను తోడుచుండెను. త్రాగుటకు నీళ్లనొసగుమని వానిని అతడు వేడెను. ''అయ్యా! నేను అస్పృశ్యుడను. మీరు బ్రాహ్మణులు. నాయొద్ద జలమును తీసికొని మీరు త్రాగుట ధర్మము కాదు'' అని యతడు బదులు పలికెను.

"నాయనా! నీవు హరియను నామము చెప్పగలవా" అని కిశోరు డడిగెను. "చెప్పగల" నని యా మనుష్యు డనెను. "అయిన హరినామస్మరణచేయుచు నీరుతోడుము. ఆ నీరు నేను త్రాగినచో పాపము లే" దని కిశోరు డనెను. అంతట నతడు హరినామమును ఉచ్చరించుచు నీళ్లు తోడగా కిశోరు డా నీరు త్రాగి తన దప్పిని తీర్చుకొనెను.

హిందూమతమునకు పునాదియగుజ్ఞానభక్తిమార్గాను సరణిగా శ్రీరామకృష్ణుడు సంఘసంస్కరణ ప్రబోధించెనని యిందువలన స్పష్టము కాగలదు.

*　　　　*　　　　*

"ఈ దినములలో ముఖ్య విషయములనే పాటిం చేయుదురు. ముఖ్యము కానివానిని సహింపరు. అందువలన మతాచారములు, కర్మలు తగ్గించుట ఉచితము" అని కాలానుగుణముగా పరమహంస నుడివెను.

గంజి సరిగా తయారు చేయుటకు పిండిని చన్నీళ్లతో ముందుగా బాగుగా కలిపి తరువాత దానిని కాచవలెను, మొదటనే వేడినీళ్లతో కలిపినయెడల అది సరిగా కలియదు. ఉండ కట్టును. ఎక్కువ యుద్రేకముతోను, తొందరతోను సంఘసంస్కరణకు ప్రారంభించినచో కలియక ఉండలు కట్టిన పిండివలె పరస్పరవిరుద్ధములైన మతాలు బయలు దేరును. సంఘసంస్కరణ మత్యావసరమైనదను మాట తెలి సిన విషయమే. అయినను ఆ పనిని తొందరపడక బహు జాగరూకతతో నడుపవలెను. అట్లు చేసినచో క్రొత్త

యుతాలు తల యెత్తవు. అప్పుడు సంస్కరణ యొక్క ముఖ్యోద్దేశము తప్పక నెరవేరుట కవకాశ మేర్పడును.

## 19. అణకువ

అణకువ (నమ్రత) యవసరమని పెద్దలు చెప్పెదరు. ఆత్మసాక్షాత్కారము నొందు మార్గముగ నమ్రతను శాస్త్రవేత్త లభ్యసింతురు. కాని ఇట్టి యణకువకంటె సత్య ప్రియత్వము వలన కలుగు యథార్థ నమ్రత యెంతో శ్రేష్ఠమైనది. నమ్రత కేవలము సాధనమాత్రమే కాదు. మనము, మన భాగ్యము, మనబుద్ధి, యితర సంపదలు: ఈ యన్నింటికిని నిజమైన విలువ ఏమైనను కలదా? సుతరాం ఏమియు లేదు. అవిద్యను విడిపించుకొనగలిగితిమేని సత్యము మనకు నమ్రతను పొందచేయును.

పేదవాని కుమారుడు తన పేదరికము తెలిసికొని అందుల కనుగుణముగా ప్రవర్తించెనేని ఆ యణకువ జ్ఞానము వలన సంభవించినదే యగును. వేఱొకరీతి ప్రవర్తించుట బుద్ధిహీనత. అట్లే భాగ్యము, అధికారము అనిత్యములని తెలిసికొని యే మనుష్యుడయినను, ఎట్టియంతస్థులో నుండినను, ఎంత భాగ్యవంతుడయినను సరియే, అణకువతో మెలగుట యుచితము. సత్యము నెఱిగి నిజమగు అణకువ కలిగియుండవలెను. ఇందులకు మారుగ ఇతరులచే మెప్పు వడయుటకొఱకు నమ్రతాప్రదర్శనము చేయువానిది నిజమైన యణకువ కాదు.

ఒక శిష్యుడు తన గురువునొద్దకు జని యిటులనెను: "నేను దీనులలో అతిదీనుడను. పాపిని. నన్ను నే నుద్ధరించు కొనుటకు మార్గము జూపుడు." శిష్యుడు సత్యము కన లేద నియు, మామూలు మాటలు మాటలాడెననియు గురువునకు తెలియును. జ్ఞానజ్యోతి ఆ శిష్యున కీయనెంచి యతడిట్లనెను: "నీవు వెళ్ళి నీకంటె హీనమైన వస్తువు నేదైన నొకదానిని తెమ్ము."

'ఓ! అదెంతటిపని' యని శిష్యుడు తలచి బయటకు వెడలెను. బయట ప్రపంచములోనికి వెళ్ళిన పిదప ప్రపం చములోని ప్రతివస్తువు తనకంటెను గొప్పదిగానే గోచ రించెను.

ఇతరమయిన ప్రతి వస్తువును, ప్రతి జీవియును తన కంటెను పరిశుద్ధమయినదిగాను ఎక్కువ యుపయోగకర మయినదిగాను ఉండుట తెలిసిన పిమ్మట అతనికి కష్టము తోచెను. తనకంటె హీనమైనదని యేవస్తువునైనను గురువు నొద్దకు తీసికొని పోయినచో గురువు 'పీడ పొగరుపో' తని యెంచునని యతడు భయపడెను. అతని కేమి చేయుటకును పాలు పోలేదు.

మరుసటి నా డుదయము బహిర్దేశమునకు జనినపుడు అతనికొక తలంపు స్ఫురించెను. "నా యమేధ్యము నాకం టెను తప్పక హీనమైనది. నేను దీనిని నా గురువుగారి యొద్దకు తీసికొనిపోయి 'ఇదియొక్కటియే నాకంటెను తక్కు వది. తదితరమంతయు నాకంటెను శ్రేష్ఠమే' యని

చెప్పెదను. ఇటుల నేను తప్పక చేసితినేని నా గురువు నా యొక్క యణకువకు నన్ను మెచ్చికొనును'' అని యతడు తలపోసెను.

తరువాత నొక చిల్లపెంకు తీసికొని తన యమేధ్యమును తీయబోయెను.

''ఓ పాపీ! నీవు నా దగ్గఱకు రాకుము'' అని యకస్మాత్తుగా నొక శబ్దము వినిపించెను. ''నీవు నా కింతవఱకు చేసినది చాలును. పాపివైన నీవు నా చెంతకు తిరిగిరాకుము. నే నొకప్పుడు మంచి యన్నమును, తియ్యని పండును ఐయుంటిని. దేవుని నైవేద్యమున కర్హత గలిగియుంటిని. నన్ను చూచిన ప్రతి మనుష్యునకు నోరూరుచుండెను. నా దురదృష్టవశమున నేను నీ సమీపమున నుండగా నీవు నన్ను తింటివి. నీ శరీరములో జొచ్చినపిమ్మట నే నిట్లు మారితిని. ఒకప్పుడు చూడబడుటకును, భుజింపబడుటకును యోగ్యమై యుంటిని. కాని మనుష్యు లిప్పుడు నన్ను చూచిన వెంట నే ముక్కు మూసికొని దూరముగా పోవుదురు. నీవు నాకు చేసినది యేది. నీ సంపర్కము నన్నింతకు తెచ్చినది. నీవు నాచెంతకు మరల రావద్దని వేడెదను. ఎందుచేతననగా నీవు మరల చెంతకు వచ్చినచో ఇంతకంటెను ఇంకను ఏ దుఃస్థితి నాకు సంభవించునో! నా యొద్దనుండి వెడలిపొమ్ము.''

అప్పుడా శిష్యుడు తానెంత నీచుడో గ్రహించెను. ''నాకంటెను హీనమయినది ప్రపంచములో నేదియులే''దని గురువు నొద్దకు వెళ్లి యతడు చెప్పెను.

## 20. ఒకటిన్నరయణా మాత్రమే విలువ

యోగసాధనలచే సిద్ధులను బడయవచ్చును. ఈ సిద్ధులచే అద్భుతములయిన పనుల నొనర్చు శక్తి కలుగును. ఈ శక్తులు అత్యద్భుతములై ప్రకృతి విధులకు విరుద్ధములుగ తోచును. ఈ సిద్ధుల సాహాయ్యమున కొందఱు యోగులితరులను విస్మితులుగ జేయు పనులొనర్తురు. ఇట్టి శక్తులను, అద్భుతక్రియలను గుఱించి యీ యోగుల శిష్యులు ప్రచారము సల్పుదురు.

ఇట్టి శక్తులు సంపాదించి ప్రజలను ఆశ్చర్య మగ్నులగునట్లు చేయుట కూడనిపని యని శ్రీరామకృష్ణ భగవానుడు చెప్పువాడు.

'ఆ పట్టణములో అత్యద్భుతశక్తులుగల యోగి యొకడున్నాడు. తాము దయచేసి వచ్చిచూడుడు' అని ఎవరైనను అన్నచో, శ్రీరామకృష్ణు డిట్లు బదులుచెప్పువాడు: 'మీ రచటికి పోవజనదు. వానిని చూచిన మీకు లాభించునని నమ్మి మీరు వానిని చూచుటకు పోవలదు.' యోగులొనర్చు క్రియలన్నియు బూటకములని శ్రీరామకృష్ణుడనుడువలేదు. ఈశ్వరసందర్శనమార్గము అది కాదనియు, అద్భుతశక్తులను బడయుట సరియగు నీశ్వరోపాసనావిధానము కాదనియుమాత్ర మతడు బోధించెను.

ఈ శక్తులు బ్రహ్మాన్వేషణపరుల సూటియగు మార్గమున కడ్డుపడు ముండ్లపొదలవంటివి. వానిలో చిక్కుకొనకుడు. మంత్రములచే మీరుగ్నతలను కుదుర్పగలమనియు,

యోగశక్తిచే వ్యాజ్యేములలో మీకు జయము కలుగ జేయగలమనియు చెప్పువారి చెంతకు పోకుడు. నిజమయిన భక్తు లీశ్వర కటాక్షమునుతప్ప ఇతరము నాశింపరు. భక్తిచేత, యోగాభ్యాసములచేత, క్రమశిక్షణచేత, కొన్ని శక్తులు చేకూరవచ్చును. కాని యవి తమంతటతామే వచ్చును. బుద్ధిపూర్వకముగా భక్తులు తమకు కావలెనని వానిని కాంక్షింపరు.

“మనము భుజించినచో తత్ఫలముగ మలము, మూత్రము, చెమట వెలువడును. కాని యెవరును అట్టి వానిని వెలువరించు నుద్దేశముతో మాత్రము భుజింపరు. నిజమయిన భక్తులు సిద్ధులను బడయుటకై భక్తినిగాని యోగమునుగాని అభ్యసింపరు. సిద్ధులు పురీషమువంటివి.”

సిద్ధులు వడసినవాని కహంకారము పెరుగును. కనుక అది భక్తి కవరోధము కలిగించునేగాని ఈశ్వరుని బడయుటకు తోడ్పడదు. అందుచేతనే శ్రీరామకృష్ణుడు “సిద్ధులు యోగముయొక్క పెంట” యనెను.

శ్రీరామకృష్ణుడు చెప్పిన యొక కథ యిది: “ఒక యోగి తన గురువునొద్దకు జని ‘నేను పదునాల్గు వత్సరములు ఏకాంతముగా కాననసీమలో తపస్సొనరించి జలముపై నడచు శక్తిని బడసితిని’ అని నుడివెను. ‘నాయనా! నీ వెందుల కంత కష్టపడితివి? పదునాలుగేండ్లు వృథా పుచ్చితివి. ఒకటిన్నరఅణాకు పడవవారు ఈ గట్టునుండి ఆ గట్టునకు చేర్చుదురు. నీవు పొందిన సిద్ధి యొకటిన్నర

ఆజ్ఞా మాత్రమే విలువగలది' అని గురువు బదులు చెప్పెను.”

ఎవరును సిద్ధులు పడయుటకు కాలము వృథాపుచ్చరాదు. ఈశ్వరకృప పొందుటకు నిజమయిన భక్తి నభ్యసింపవలెను. అద్భుతశక్తులచే నిన్ను తప్పుమార్గమున కీడ్వగోరు యోగులగోష్ఠిలో చేరకుము. ఇది శ్రీరామకృష్ణుని ప్రబోధము.

## 21. అడుగుననుండు బండ

జగత్తులో అత్యల్పభాగముమాత్రమే మన కింద్రియగోచరమగును. ఎంత తెలివిగలవాని మనస్సైనను కొంత పరిమితిలోపలనే వర్తింపగలదు. సత్యమననేమి? జ్ఞానమననేమి? చిత్తమననేమి? ఇవియన్నియు పరిష్కరింపబడని సమస్యలు. కనుక మన పరిశోధన లన్నియు సమస్యలలో సమస్యలు.

అన్నివస్తువులును—ప్రాణముగలవి, ప్రాణములేనివి; బోధముగలవి, బోధములేనివి—ఒకే పరమప్రకృతియొక్క భిన్నరూపములు.

నీటిలో జనించు బుడగలు, నీరు ఒకవస్తువే. బుడగలు నీటిలో జనించి, తేలి, నీటిపై చలించి, పిదప నీటితో నొకటియై అదృశ్యమగును. జీవరాసులుకూడ ఆ బుద్బుదములవంటివియే. నీటిని పరబ్రహ్మముతోను, నీటిపై కనబడు బుడగలను వివిధములై ప్రత్యేకతగల జీవులతోను, పోల్చ

వచ్చును. భగవంతుడు పరమసత్యము. అందులో అన్నియు ఇమిడియున్నవి. అది యన్నిటికిని అతీతమయినదికూడ. సమస్తజీవకోటిలోను గోచరించు ప్రాణశక్తి యదియే. చివరకు అన్నియు అందులో లీనమై అదృశ్యమగును. బ్రహ్మము మాత్రమే సత్యము. చేతనాచేతనభూతములన్నియు నీటిపై తేలు బుడగలవంటివి. అవి తమయంతటతాము (అనగా నీరులేనిది) ఉండలేవు.

పరమసత్యము వరదపాఱుచున్న కావేరివంటిది. మన యహంకార కారణమున మన దోసిటిలోగల ఆ నీటిని కావేరీనదియే అని భ్రాంతిపడుచున్నాము. సముద్రపు లోతును కనుగొనుటకై ఒక ఉప్పుబొమ్మ దానిలో ప్రవేశించుట వంటిదే మన వేదాంతాన్వేషణము. సముద్రములో మునిగిన క్షణమునందే ఆ ఉప్పుబొమ్మ కరగిపోవును. తరువాత అది యేమి పరిశోధనచేయగలదు? ఈశ్వరుని మేర కనుగొను యత్నమున జీవుడు అతనిలో మునిగిన తత్క్షణమే అతనితో ఐక్యమును పొందును. ఇక అతడు ఈశ్వరుని మేరను ఎట్లు కనుకొనగలడు?

మనుష్యునిశరీర మొక కుండవంటిది. మెదడును, ఇంద్రియములును ఆ కుండలో ఉడుకు బియ్యము, పప్పు, నీళ్లవంటివి. కుండ పొయ్యిమీద కాగును. కుండను ముట్టుకొనిన వేడిగానుండును. ఉడుకుచుండు అన్నమును ముట్టుకొనిన వ్రేళ్లు బొబ్బలెక్కును. కుండలోను, అన్నములోను ఉండు వేడిమి వాస్తవముగా కుండకుగాని, అన్నమునకుగాని

చెందినదికాదు. మండెడుపొయ్యియొక్క వేడిమి వాని యొక్క వేడిమిగా నయినది. అదేరీతిగ బ్రహ్మము చేతనా చేతన వస్తువులలోగల వివిధగుణములుగా మారినది. మెదడుయొక్కయు, ఇంద్రియములయొక్కయు వ్యాపారములు వాస్తవముగా, బ్రహ్మముయొక్క వ్యాపారమే. ఆశక్తివలన తప్ప నొక సికతా (ఇసుక) రేణువుకూడ చలింపదు.

ఏ వస్తువునుగుఱించియయినను మనము లోతునకు దిగి విచారించినకొలది పర్యవసానమున ఈశ్వరునొద్దకే చేరుదుము. సేలముజిల్లాలో ఎచట నూయి త్రవ్వబోయినను, కొంత లోతునకు వెళ్లినతరువాత బండ తగులును. బ్రహ్మము కూడ నట్టిదే. ఏ వస్తువయినను సరే—అది చిన్నదిగాని, పెద్దదిగాని — దాని అడుగున బ్రహ్మమనెడు బండయే కాన్పించును.

## 22. పిలువుము, అతడు వచ్చును

"మాయనుండి తప్పించుకొనుట కుపాయమేమి?" అని యొక శిష్యుడు శ్రీరామకృష్ణుని పృచ్ఛజేసెను అందు కాయన ఇట్లు బదులిడెను :

"నిజముగా తప్పించుకొనవలెనను కోరికయున్న వారికి భగవంతుడే మార్గముచూపును. 'కోరికయుండుట' అనగా 'ఉన్నది' అని ఉచ్చరించుటమాత్రమే కాదు. ఆట్టి తలంపు అతనిలోనుండి పొంగిపొరలవలెను. అతని

హృదయమంతయు అందుకై ఆవేదనపడవలెను. భార్యను గురించియు భాగ్యమునుగురించియు ఆవేదనతో మనము కన్నీరు కార్తుము. కాని భగవంతుని నిమిత్త మిట్లు ఎవ రావేదనపడుదురు?

"పసిబిడ్డ బొమ్మలతో సంతోషముగా ఆడుకొను చున్నంతసేపు తల్లి వంటయింటిలో తన పనిచూచుకొను చుండును. ఆటచే విసిగి ఆ పసిబిడ్డ బొమ్మల నవలకు పార వేసి బిగ్గరగా ఏడ్వ మొదలుపెట్టును. తత్క్షణమే తల్లి తన పని వదలుకొని, బిడ్డకొద్దకు పరుగిడును. ఆ తొందఱ పాటులో వంటయింటిలోని వస్తువులను పడద్రోసి చెల్లా చెదరు చేయవచ్చును. అటులనే జగన్మాతయయిన దేవి ఆవేదనతో ఏడ్చు తన యథార్థభక్తునికొద్దకు పరుగిడును.

"ఈ కలియుగములో ఘోరతపస్సు చేయ నవ సరము లేదు. మనఃపూర్వకముగాను, శ్రద్ధతోను, ఆతురత తోను మూడు దినములు ధ్యానము చేసిన చాలును. దేవి తన బిడ్డలపై కటాక్షము చూపును. నమ్ముకొనుడు: ఇది అనృతము కాదు. నాయనా! ఆమె సాక్షాత్కారము పడయగోరితివేని ఆమెకై తీవ్రముగను హృదయపూర్వకము గను మూడు దినములు విలపింప యత్నింపుము. నీకు జయముకల్గును. 'ఓ దేవీ! నాకు భక్తినిమ్ము. నా సందేహ ములను పారద్రోలుము. నేను నిన్నెప్పుడును మరవక యుండునట్లు చేయుము. నా పాపములను తొలగింపుము' అని అకృత్రిమహృదయముతో మనవి చేసికొనుము. ఆ

భక్తియొక్క ఫలితము నీకు తప్పక చేకూరును. మనః పూర్వకమయిన ప్రార్థన యెన్నటికిని నిష్ప్రయోజనము కాదు. నీకిందు సందేహము కలదేని నన్నుచూచి ధైర్యము తెచ్చుకొనుము.

" 'అమ్మా! నాకాకలి యయినప్పుడు నన్ను లేపుము' అని బిడ్డ చెప్పును. 'ఆకలియయినపు డది తనయంతట తానే లేచును' అని తల్లి తనలో అనుకొనును. నీవు భగవత్ క్షుధార్తుడవైనపుడు నిన్నెవరును లేప నవసరము లేదు. ఎవరును నీకు మార్గము చూప నవసరము లేదు. వీథి నాటకములలో మనము దీనిని చూచుచుందుము. మొట్ట మొదట మద్దెలలు వాయించుచు కృష్ణు నాహ్వానించు పాటలు మిక్కిలి బిగ్గఱగా పాడుదురు. కాని కృష్ణవేషధారి వినుపించుకొనడు. ఏమియు పట్టనియట్లు తెఱచాటున కూర్చుండి తినుచు, మాటలాడుచు ఉండును. తరువాత ధ్వనియంతయు ఆగిపోవును. 'రావోయికృష్ణ' యని నారదుడు వీణ పుచ్చుకొని మృదుస్వరముతో పాడును. వెంటనే కృష్ణుడు రంగస్థలమునకు తటాలునవచ్చి నిలబడును.

"వట్టి దంభముచేతను ధ్వనిచేతను లాభము లేదు. తన యథార్థభక్తునెడమాత్రమే భగవంతున కమిత వాత్సల్యము కలదు.

"వీథినాటకములలోని ఈ సంఘటనమువలన ఈ సత్యము మిక్కిలి సుస్పష్టముగ—ఎట్టి యమాయకులైనను గ్రహించునట్లు—తేటపడును."

"ఓ దేవా! ఓ ప్రభూ!" అని పెదవులతో నుచ్చరించు మాటలవలన ఫలితము లేదు. హృదయము నిండినపుడు పెదవులు కదలలేవు. తన యథార్థభక్తుని హృదయములో జనించు విలాపమును దేవి యాలకించును. ఆమె వెంటనే వానియొద్దకువచ్చి అనుగ్రహించును.

## 23. వడ్రంగి భార్య

ఒకప్పుడు శ్రీరామకృష్ణుని శిష్యులలో నొకనికి రాజకీయోద్యోగము లభింపగా "కూలికి పనిచేయుట యుక్తమా?" అని అత డాయనను ప్రశ్నించెను. "నాయనా! నీ తల్లిని పోషించుటకై ఈ యుద్యోగమున ప్రవేశించితివి. నీ కార్యము యుక్తమైనదే. ఇట్టి యవసరము లేనిచో అది తప్పుపని యగును. ఉద్యోగములోనుండి భగవంతునిసేవ చేయుము" అని శ్రీరామకృష్ణుడు నుడివెను.

కొందఱు భాగ్యము, అధికారము సంపాదించి అందుచే గర్వించి అహంభావము నొందుదురు. భాగ్యవంతులను, అధికారముగలవారిని, మనుష్యులు గొప్పగా తలంచెదరు. కాని యెంతకాల మైశ్వర్యము అధికారము, ఉండును? మనము చచ్చినప్పుడు భాగ్యము, అధికారము మనతోరావు. అట్టిచో మనము వాని నెందులకు ఎక్కువగా చూడవలెను? భాగ్యవంతుడు తనకంటె మిక్కిలి ఎక్కువ భాగ్యవంతులుకలరనియు, అట్టివారితో పోల్చినచో తాను బిచ్చగాడేయనియు మఱచును.

"చీకటిపొడమినంతనే మిణుగురు పురుగులు ఆకసము పైకివచ్చును. 'ప్రపంచమునంతటిని కాంతియుతముగా చేయుచున్నది మనమే. మనంతటివా రింకెవరును లేరు' అని అవి తలచును. కాని కొద్దిసేపటికి తారాగణ మాకసముపై ప్రకాశించుట మొదలుపెట్టును. అప్పుడు మిణుగురు పురుగులు సిగ్గుచెంది నమ్రములగును. 'ఓ! ఆకసము లోని నక్షత్రములు మనకంటె కాంతియుతములుగా నున్నవి. మన గొప్పతనమును గురించి మనము గర్వింపరాదు' అని యవి తెలిసికొనును. తదుపరి పూర్ణిమాచంద్రు డుదయించును. అతని కాంతిముందర తారలప్రకాశము క్షీణించును. చంద్రుడు పూర్ణవైభవముతో ప్రకాశించుచు గర్వముతో 'నాతో సమానమయిన ప్రకాశముగల దేదియు లేదు. భూమినంతటిని నా తేజస్సుచే ముంచివేసితిని' అని తలపోయును. ఆకస్మికముగా తూర్పుకొండను సూర్యుని కాంతి యావరించును. ఇప్పుడు చంద్రుడెక్కడ? దీనిని చూచి భాగ్యము కలిగియు అణకువగా నుండుము" అని శ్రీరామకృష్ణుడు చెప్పెను.

"నీళ్లు వంతెన క్రింద స్వేచ్ఛగా ప్రవహించును. ఒకచో నిలిచి కుళ్లువాసన వేయవు. ధనమును కూడ అదే రీతిగ చరింపనిమ్ము. దానిని నీయొద్ద నిలువనీయకుము. అది యపరిశుభ్రమై దుర్వాసన వేయగలదు. దానిని చరింపనిచ్చి మంచి చేయనిమ్ము. ధనమును నీకు బానిసగా చేసికొనుము. అది నీ యజమానుడు కాకుండునట్లు జాగ్రత్త పడుము.

"వడ్రంగియొక్క భార్యను చూడుము. ఒక చేతితో రోటిలోనికి ధాన్యమును త్రోయుచుండును. మఱియొక చేతితో ఒడిలోని బిడ్డను చిచ్చికొట్టుచుండును. ఈ పనులు చేయుచునే ఆమె అటుకులు కొనుటకై వచ్చిన వానితో మాటలాడుచు బేరము చేయుచుండును. ఇట్లు అనేక విషయము లందు మగ్నురాలైనను ఱోకటిపోటుచే తన వ్రేళ్లు నలిగి పోకుండునట్లు జాగ్రత్త తీసికొనుచుండును. అదే రీతిగ సంసారయాత్రయందు పూర్ణపరిశ్రమ చేయుచున్నను, భగవంతుని విడువకుండ మనమున నిడికొని సూటిమార్గమున నడుపుము.

"స్తంభము చుట్టు గిరగిర తిరుగు ఆ పిల్లవానిని చూడుము. అతడు స్తంభమును గట్టిగా బట్టుకొని యున్నాడు. ఎంత వేగముగా తిరుగుచున్నను స్తంభమును మాత్రము గట్టిగ పట్టుకొనియే ఉండును. ఆ రీతిగనే భగవంతుని గట్టిగ పట్టుకొని సంసారయాత్రలో తిరుగుచుండుము.

"తలపై నీళ్లకుండలు మోసికొని పోవుచున్న పల్లెటూరి పిల్లలను చూడుము. తలమీద మొదట నొక పెద్ద కుండయు, దాని మీద అంతకన్న చిన్నకుండయు, దాని మీద నింకను నంతకన్న చిన్నకుండయు కలవు. ఆ అన్ని కుండలు నీళ్లతో నిండియున్నను ఆమె నడచునపుడు ఒక చుక్క నీరైనను తొలకదు. ఆమె నడచుచు ఇంటివిషయములు, ఇంకను ఇతర విషయములు మాటలాడుచుండును. అట్టి నిపుణతతో నీవు నీ సంసారము చేయవలెను. నీ వేది

చేసినను సూటిమార్గము నవలంబించి దానిని తప్పు కుందుము.''

ప్రతి పనియు భగవదర్పణ భావముతో చేసిన కీడు సంభవింపదు. ఇదియే కర్మయోగము. భక్తియోగముకూడ ఇదియే.

''పనసపండు కోయునపుడు మనము అర చేతులకును, వ్రేళ్లకును నూనె రాచుకొందుము. అప్పుడు పనసజిగురు చేతి కంటదు. పండు కోసి తొనలను లాగుకొనవచ్చును. అదే రీతిగ మనము భగవంతునియందు దృఢభక్తి కలిగి యుండి మన సంసార జీవనమును నడపుకొనవలయును. ఇట్లు చేసితిమేని ధనము యొక్క, సుఖము యొక్క అను బంధములు మన కంటవు. కష్టము సంభవించినను మనసు దుఃఖింపదు.''

## 24. నెమరు వేయుట

ఆవుయొక్క పాలు దాని శరీరమంతయు వ్యాపించి దాని నెత్తురుతో కలిసియుండును. కాని దాని చెవులు పిండిన మనకు పాలు వచ్చునా? రావు. పొదుగునుండియే పాలు వచ్చును. ప్రపంచ మంతయు భగవంతునితో నిండి యున్న మాట వాస్తవమే. కాని అందలి పుణ్యక్షేత్ర ములు ఆవు పొదుగు వంటివి. భక్తులచటికి జని, అచట నీటి చెలమలోవలె పొంగిపొరలుచుండు భక్తితో తమ హృదయములను నింపుకొని యీశ్వర సాన్నిధ్యము చేరు

దురు. లెక్కలేని పురుషాంతరములుగా భక్తులు తపోధ్యాన నిష్ఠలు జరుపుటచే పావన మయిన క్షేత్రములలో భగవంతుడు సులభముగా దర్శనమిచ్చును. అసంఖ్యాకులయిన భక్తుల తపస్సు, సంకీర్తనము, ధ్యానము, పూజాప్రార్థనలు అచట నిక్షిప్తమైనవి; భక్తి విశ్వాసపూరిత హృదయములతో నచటికి జనువారి చిత్తములు అవశములై పోవును. భక్తుల పాదధూళి యొక్క రేణువయినను మనలను స్పృశించిన చాలు ననుటకు భావమిదియే. విద్యావంతులును, విద్యారహితు లును అగు గణనాతీత భక్తకోట్లు ఎచట నిలబడి ఉపాసన సల్పిరో యట్టి ప్రదేశముల కనన్యమయిన పవిత్రత గలదు. భక్తుల నృత్యసంకీర్తనములచే పావనములైన యట్టి క్షేత్ర ములలో పాషాణసదృశములగు హృదయములుకూడ కరగ గలవు. భక్తిపూరిత హృదయములతో మనమును అచట అణకువ గలిగి ప్రణమిల్లితిమేని, అదృశ్యరూపమున సర్వాం తర్యామిగానుండు భగవంతుడచట సాక్షాత్కరించియుండుట మనము కననగును.

భూమిని మన మెచ్చట త్రవ్వినను జలము లభించును. కాని కొన్ని ప్రదేశములలో ఇదివరకే వాపీకూపతటా కములు, సరస్సులు గలవు. వానియొద్దకు జని మనము సుల భముగా దప్పిని శమింపజేసికొన నగును. అదేమాదిరి మన దేవాలయములు, పుణ్యక్షేత్రములు, పుణ్యనదులు మన భక్తి యను దప్పిని తీర్చుకొనుట కుపయోగపడును.

ఈ పవిత్ర క్షేత్రములను మనము సద్వినియోగము చేసికొనవలెను. గోవులు పచ్చికబయళ్లలో పుష్టిగా మేసి ఒక ఛాయాప్రదేశమున తీరికగా నెమరు వేయుచుండును. అట్లేగాక మనము పుణ్యక్షేత్రములకు జని పూజలు సల్పి తదుపరి మన కా క్షేత్రములలో కలిగిన తలపులను, భావములను గురించి యోచన చేయవలెను.

యాత్ర పూర్తిచేసినంతనే మన కర్తవ్యము తీరినదని యెంచరాదు. మన పవిత్ర భావములను, భక్తిని అంతటితో పోనీయరాదు. ఏకాంతమగు నొక స్థలములో కూర్చొని, మనస్సును ధ్యానాయత్తముచేసి, ఆ పుణ్యక్షేత్రములలో మన మనస్సులందు నిండిన భక్తిని దృఢపఱచుకొన ప్రయత్నింపవలెను. అట్లు కానిచో మన యాత్రవలన మనకు లాభ మేమాత్రమును చేకూరదు.

* * *

పుణ్యక్షేత్రమునకు జనిన మాత్రమున గాని, అచట నివసించిన మాత్రమున గాని, లాభము కలుగదు. మానసిక భావమే ముఖ్యము. హృదయములో భక్తి లేనిచో పుణ్యప్రదేశములయొక్క లాభము సమకూరదు. హృదయములో భక్తి యనునది యున్నయెడలనే పుణ్యక్షేత్రములకు జని మనము దానిని వృద్ధిపఱచుకొననగును. మొదటనే కొంతభక్తి ఉన్నగాని పుణ్యప్రదేశములకు పోవుట నిష్ప్రయోజనము.

తలిదండ్రులతో పోట్లాడి యొక బాలుడు కాశీకి గాని లేక మఱియే యితర పుణ్యప్రదేశమునకు గాని పారి

పోవ వచ్చును. అచ్చట నేదేని యొక యుద్యోగము సంపాదించి యందులో కొంత తలిదండ్రులకు పంపవచ్చును. కాని భక్తికై కాశికి పోవుటకును, దీనికిని వ్యత్యాసము కలదు.

శ్రీరామకృష్ణు డొకసారి వేడుకగా మాటాడుచు ఇటుల నుడివెను: "కలకత్తాకు పశ్చిమమున నున్న యొక పుణ్యస్థలమునకు నేనును మథురానాథుడును వెళ్లితిమి. అచట నున్న మామిడిచెట్లు, వెదురుపొదలు దాదాపు మన వైపున ఉన్నట్లుగానే యుండెను. ఎట్టి భేదము లేదు. కాని ఒక్క భేదముమాత్రము ఉండెను. ఆ పుణ్యప్రదేశములో నివసించు జనులకు మంచి జీర్ణశక్తి గలదు. ఏది తినినను అది వారికి జీర్ణమగునట్లు తోచెను." భక్తి శూన్యులై పుణ్యక్షేత్రములలో నివసించి సుష్ఠుగా భుజించిన ప్రయోజనము లేదని ఆయన నుడివిన దానియొక్క భావము.

## 25. రక్షించుకొను మార్గము

"జనక చక్రవర్తిని చూడుము. ఆయన మహాజ్ఞానియైన గొప్ప ప్రభువు. ప్రపంచజీవనము చేయుచుండియు అతనివలె జ్ఞాని యగుట దుర్లభము కాదు" అని కొంత మంది యందురు. అయినను అట్లనువారు చరిత్రలో నొక్క జనకుడు మాత్రమే యున్న విషయము మఱచెదరు. ఈ ప్రపంచములో నిస్సంగబుద్ధితో స్వధర్మమును నిర్వర్తించుకొనుచుండియు జ్ఞానిగా నుండవలెననినచో ప్రశాంతముగా నేకాంతస్థలమున కొంతకాలమైనను ధ్యానము సల్పవలెను.

ఈ నియమము నొక సంవత్సరముగాని, యాఱు మాసములు గాని, యొక మాసము గాని, కనీసము పండ్రెండు దినములు గాని జరుపవలెను. ఆ కాలములో విడువక భగవంతుని గూర్చి ధ్యానించుచు అతని కటాక్షమును వేడుకొనుచుండ వలెను. ప్రపంచములో గల దేనినేనియు నీది యని గాని, నాది యని గాని యెంచరాదు. ఈ తలంపు మనస్సులో గాఢముగా నాటుకొనవలెను. నీవు, నీది యని తలంచు సర్వ మును ఎప్పుడో యొకప్పుడు నిశ్చయముగా నశించి యదృశ్య మగునని దృఢముగా గ్రహింపవలెను. ఒక్కటి మాత్రమే శాశ్వతము. అది భగవంతుడు. మనలో నశ్వరము కాని వస్తువు అతడొకడే. అన్నిటికి మూలాధార మీశ్వరుడు. అతడే సర్వము. భగవత్సాన్నిధ్యమును పొందవలె నను నేకైక లక్ష్యముతో మనస్సును నిర్మలముగాను పాపరహి తముగాను చేసికొని ధ్యానము చేయవలెను. ఆయనను పొంద వలెనను ఒకే కోరికతోను, ఆతురతతోను ధ్యానము సల్పుము. ధ్యానమును, భక్తిని నిరసించి అపహాస్యము చేయువారితో కలయకుము. అగౌరవముతోను, పరిహాస భావముతోను భక్తులను చూచువారి సాంగత్యమును వీడుము.

* * *

నీ హృదయము చంచలించునపుడు జగన్మాత యయిన దేవిని ప్రార్థింపుము. ఆమె నిన్ను రక్షించును. నీ హృదయాంతర్గతములగు పాపములనుండి ఆమె నిన్ను కాపా

డును. ఈశ్వరి నీ చెంతనే ఉన్నదని సదా స్మరింపుము. అట్లు చేసితివేని పాపపుతలంపులనుండి, పాపకృత్యములనుండి నీవు సిగ్గుచే జంకుదువు. ధ్యానముచే కృపబడసినవాడు ఎట్టి యవస్థలో నున్నను, ఏమి సంభవించినను మనసులో కల వరము లేకుండ సూటిమార్గమున నడచును; కుశలతతోను, అణకువతోను, తన విధ్యుక్త ధర్మమును నిర్వర్తించును. దేవునియందు భక్తియు, సోదరమానవుల యందు దయయు, కర్మములందు ఋజుత్వమును వానికడ గోచరమగును. విద్వాంసులలో అతడే జ్ఞాని. ఇతరులవలె నతడును వాదింప గలడు. ఏ లోటు లేకుండగ తన తల్లిదండ్రులయెడల ప్రేమగౌరవములతో అతడు ప్రవర్తించును. మిత్రులయెడ లను, బంధువుల యెడలను అతడు ప్రేమ చూపును. అతని వాక్కు మధురము. అతడు ఇతరులయెడ సహాయ స్వభావము గలిగియుండును. ప్రతివారియొద్ద ప్రేమగౌరవముల పొందును. తన భార్య యెడల సాక్షాత్తు ప్రేమ యవతారమే. సంసార జీవనము చేయుచున్నను, ప్రపంచములో నున్నట్లు కనిపించి నను, ఇట్టి శిక్షను పొందినవానినే జ్ఞానియని పిలువవచ్చును.

శ్రీరామకృష్ణ భగవానుని బోధనలు ఆచరణసాధ్య ములు కానివి కావు. అవి ఆయన యనుభవపూర్వకముగ నిరూపించి, యితరు లవలంబించుటకై నుడివిన సత్యములు.

"దేవి నీ చెంత నిలచియున్నది. ఆమె పాదములపై పడుము. నీ కోరిక లన్నియు నెరవేరును. నిన్నామె పాప ములనుండి రక్షించును" అనునవి అతడు స్వానుభవమువలన

చెప్పిన మాటలే. అది గ్రహించి ఆ ప్రకారము మనము నడచుకొనిన మనము రక్షింపబడుదుము. మన దేశముకూడ బాగుపడును.

## 26. నీ స్వీయజనని

తమ గౌరవమును తెలుపు విషయములను మాత్రమే యేరి మనుజులు స్వీయచరిత్రములలో వ్రాసికొందురు. గౌరవభంగకరములగు విషయములను దాచెదరు. లేదా మభ్యపఱచెదరు. మనము చేయదలంచియుండియు భగవత్కృపచే చేయకుండినట్టి దుష్కార్యము లెన్నియో నిజమగు స్వీయచరిత్రలో కాన్పించును.

భగవంతుని అపారకరుణచే మనము పాపములనుండి తప్పించుకొందుము. అతని కరుణయే లేనిచో గొప్పవారును, జగద్విదితులు నైన అనేకులగతి యెంతో వేరుగ నుండెడిది.

అతని కటాక్షమువలన మాత్రమే మనము రక్షింపబడుదుమను మాట నిజమే. అయినను మనము మన ప్రయత్నమును విడువరాదు. ఈశ్వరకృప వాయువు వంటిది. సముద్రముపైన అది యెప్పుడును వీచుచునేయుండును. కాని నావికు డా వాయువువలన ఉపకారము పొందవలెనన్నచో తెరచాపలను విప్పవలెను. లేనిచో పడవ కదలదు. మనము హృదయములయొక్క తెరచాపలను విప్పి ఈశ్వరకటాక్ష మనెడి గాలియొక్క లాభమును పొందవలెను.

* * *

మన మీ ప్రపంచములో నొనర్పవలసిన విధులలో గొప్పవి, తక్కువవి అను భేదము లేదు. అన్ని పనులకు నొకటియే విలువ. మనముచేయు పనుల నన్నిటిని భక్తితోను, మనస్సున నాటుకొనియుండు భగవద్భావముతోను, చేయవలెను. అప్పు డతని కృప మన తెరచాపలలో నిండి మనలను పురోగమింప చేయును. మనము చేయవలసిన కృత్యములకు కావలసిన సాహాయ్యము, సాధనములు అతని కృపచే మనకు గల్గును.

"ఇంటిలో యుగములనాటినుండియున్న యంధకారమును జ్యోతి వెలిగింపబడిన వెంటనే పారద్రోలును. అదే ప్రకారముగ దేవుని కటాక్షమనెడి జ్యోతిని వెలిగించినచో అనేకజన్మములనుండి పేరుకొనియున్న పాపపుంజములు నశించిపోయి భక్తియను వెలుతురు ప్రకాశింప మొదలిడును."

"ఓ పవిత్రుడైన మహానీయా! నీ పీశ్వరుని సందర్శించితివని జనులు వక్కాణింతురు. మాకు కూడ నతని దర్శనభాగ్యము కలుగుటకు సాహాయ్యము చేయుము" అని లౌకికులు కొందఱు శ్రీరామకృష్ణునితో పలికిరి.

"భగవదిచ్ఛయైనచో మీకును అతని దర్శనము గలుగును. అయిన మీరును కొంత ప్రయత్నము చేయవలెను. నేనే ఆవును పితికి, పాలను పెరుగుచేసి, దానిని చిలికి, వెన్నతీసి, దానిని మీనోట పెట్టవలెననియా మీ కోరిక?" అని భగవానుడు నవ్వుచు ననెను.

* * *

మందమారుతము వీచునపుడు మనము విసనకఱ్ఱ నుప యోగింపము. గాలిలేని సమయముననే దాని నుప యోగింతుము. ఈశ్వరకటాక్షము మనపై ప్రసరించ నేని మనము స్వప్రయత్నమును మానవచ్చును. అప్పుడు ప్రార్థన గాని, ధ్యానముగాని చేయ నవసరముండదు. ఆయన కరు ణయే చాలును. కాని యతని కరుణ యనెడి చల్లనిగాలి వీవనపుడు మన ప్రయత్నమను విసనకఱ్ఱ యవసరమగును.

"నేను", "నాది" యను భావ మున్నంతవఱకు అతని కృప ధారాళముగా ప్రసరింపదు. నిన్ను గురించి నీవే గొప్పయని తలచునపుడు అతడు దూరమున నిలచియుండును. నీ యహంభావమును విడచినప్పుడే అతని కరుణను పొందు టకై నీవు నీ తెరచాపల నెత్తినట్లు. అపుడు నీ కా కరుణ అపారముగ లభించును. మన గర్వమే అతని కరుణాప్రసార మునకు అవరోధము గలిగించును.

*　　　*　　　*

పసిబిడ్డ దుమ్ములో పొరలాడి తలపై దుమ్ము పోసి కొనును. అది దానిస్వభావము. ఆబిడ్డకు స్నానము చేయించి, శుభ్రపఱచి, చెక్కు చెదరకుండ కనుపించుటను జూచి యానం దించుటలో తల్లి కుత్సాహము. తప్పు చేయుట మనుష్యులకు సహజము. అయినను ఈశ్వరి వారిని పాపములనుండి తొల గించును. మన మామె బిడ్డలము. భయపడనవసరము లేదు. నీ తల్లినివలె జగన్మాతనుకూడ ప్రేమింపుము. నీ పాపము లన్నియు శమించును.

నాయనా! జగన్మాతను మోసముచేయ నెంచకుము. ఆమె నుపాసింపుము. ఈశ్వరి నిజమయిన తల్లి. ఇతర వస్తువులవలె నిన్నుకూడ సృజించినది ఆమెయే. కన్నతల్లి నెటుల ప్రేమింతువో యటులనే యామెను ప్రేమింపుము. అట్లు చేయుటవలని సుగుణము నీకు త్వరలోనే గోచరమగును. నీ బుద్ధి, శరీరము ప్రకాశముతో వెలుగును. చిన్నబిడ్డ తన తల్లి యొడిలో పడుకొని, ఆమెయొక్క ప్రేమాస్పదమయిన మోమును తిలకించి, హసించునప్పుడు ఆబిడ్డకు ఎట్టి యానందము కలుగునో అట్టి యానందము నీకును సమకూరును.

## 27. భక్తుడు

సహస్రవర్షంబు లొక చెకుముకిరాతిని జలములో నుంచినను, అందులోని యగ్ని చల్లారదు. ఉక్కుతో నీవు కొట్టినక్షణముననే దానిలోనుండి అగ్నికణము బయలు దేరును. ఎన్ని సంవత్సరములు జలములో మునిగియున్నను దానికి స్వభావసిద్ధమయిన అగ్ని యటులనే యుండి బహిర్గత మగుటకు వేచియుండును. నిజమయిన భక్తునియొక్క భక్తి చెకుముకిరాయి వంటిది. ప్రపంచసంపర్కముచేత అది మాలిన్యము పొందదు. ఎన్ని కష్టనిష్ఠురములు సంభవించినను అది చలింపక సుస్థిరముగ నుండును. భగవంతునిపై నతనిప్రేమ చెకుముకిరాతిలోని నిప్పువలె అనశ్వరముగా నుండును. చెకుముకిరాతిని ఉక్కుతో కొట్టినప్పుడు నిప్పురవ యేరీతిని బహిర్గతమగునో యటులనే భగవన్నామము అతని

చెవిలో బడగానే నిజమయిన భక్తి యనెడినిప్పు ప్రజ్వరిల్లును.

కష్టములును నిరపనిందలును భక్తుని ఎదుర్కొన వచ్చును. అవి యన్నియు నతని భక్తిని పరీక్షించునట్టివి. అతని భక్తి వీనిచేత అంతరింపక పోవుటయే కాక పుటము వేయబడిన బంగారమువలె మునుపటికన్న నిర్మలస్వరూపమున బయటపడును.

ఇంద్రియభోగవ్యామోహమునుండి తప్పించుకొనుట సాధ్యమగునా? ఆనందదాయకమగు భగవద్ధ్యానము సుస్థిరమగు నభ్యాసముగ ఏర్పడినయెడల తప్పించుకొనవచ్చును. పరమానందము చవిచూచినవానికి ఇంద్రియభోగసుఖములయొక్క శక్తి పోవును. పరమానందమును చవిచూచిన యతడు, క్షణములో కష్టముగా మారు అస్థిర సుఖముల నన్వేషించుటయందు మునిగిపోడు. అవి మనస్సును తప్పుత్రోవలకు ద్రిప్పునేగాని నిజమయిన సంతోషమును కలుగజేయవని తెలిసి, అతడు తన్ను తాను బుద్ధిపూర్వకముగ కష్టములపాలు చేసికొనడు. పటికబెల్లము చవిచూచినవాడు దుమ్ము మురికి ముద్దకై ఆశింపడు. రాజు లుపయోగించు పాన్పుపై సుఖనిద్ర చెందిన యతడు ఒక మురికి గుడిసెలో నేలమీద పరుండునా? భగవద్ధ్యానామృత మత్తుడైనవాడు కల్లువలన కలిగెడి యానందమును పొందుటకు యత్నింపడు.

* * *

దేనిమూలముననైనను, ఇంద్రియసుఖములను గూర్చినతలంపులు నిన్ను కలంచినపుడు వెంటనే భగవంతుని పైకి నీ మనమును త్రిప్పుము. దీని నభ్యసించినచో అన్ని యపాయములను నీవు జయింపగలవు. ఈశ్వరి సర్వదా నీతో నున్నదని జ్ఞప్తి పెట్టుకొనుము. నీ వేకాంతమున నున్నప్పుడు మనుష్యులెవ్వరు నిన్ను చూడజాలరు కాని, ఆమెమాత్రము నీదగ్గఱనే నిలబడియుండును. ఇది తెలిసికొనిన భక్తున కెట్టి యపాయముగాని ఎట్లు సంభవింపగలదు? నిరంతర దయారస పరిపూర్ణయగు దేవి సాన్నిధ్యమును అనుభవించుచుండువానిని ప్రపంచములోగల ధనమంతయు, సౌందర్యమంతయు తమ వైపునకు ఆకర్షింపజాలవు. నిజమైన భక్తియు, ఉపాసనయు పేరు ప్రతిష్ఠలను తృణీకరించును. ఏకాంతత, ప్రశాంతత అట్టి స్థితియొక్క లక్షణములు. ఆడంబరసహితమును శబ్దమయమును అగు ఉపాసన వృథాపటాటోపము. జలపాతము కొండక్రిందికి దుముకుచు రాళ్లపై క్రీడలుసల్పి ఆపిదప గంభీరమయిన నదిగా పొంగును. నిజమయిన భక్తి యట్టిదే. అన్ని యభ్యంతరములను, సందేహములను, జీవిత భ్రాంతులను అది ఒక్కకుప్పిగంతులో దాటును. అది రానురాను మరింత మరింత దృఢతను, బలమును పొందుచుండును. భక్తుడు కాలానుగుణముగవచ్చుచుండు దుఃఖములను, మనశ్చాంచల్యములను అవలీలగ జయించి మనశ్శాంతిని బడయుచుండును. భక్తుని మనస్సునందుకలుగుకలవరములు క్షణికమాత్రములు, భక్త్యానందములో నవి యన్నియు సత్వరముగా సమసిపోవును.

భక్తుడు జగత్ప్రభువుయొక్క బిడ్డ. అతడు (భగవంతుని కై) వదలు కన్నీటి బిందువులే అతనిబలము. భగవన్నామమొక్కటియైనను వినినయంతనే రోమములు గగుర్పాటు చెందుటయు, ఆనందాశ్రువులు చెక్కిళ్ల వెంట పొరలుటయు భక్తుని లక్షణములు. నీయందీ లక్షణములు గోచరించినపుడు ఇది నీ తుదిజన్మయనియు, మోక్షము దగ్గఱలో నున్నదనియు గ్రహింపుము.

## 23. ఇంకను అసత్యము, కపటము ఎందులకు?

మన దేశము స్వాతంత్ర్యము పడసినది. మనకు లభించినది స్వయంపరిపాలన రూపమగు ప్రభుత్వము (రిపబ్లికన్). జాతుల (నేషన్సు)లో మన దేశమునకు గౌరవస్థానము కలదు. ప్రపంచమునందలి మహోన్నతపురుషులచేత మన నాయకుడు స్తుతింపబడి గౌరవింపబడుచున్నాడు. ఇట్టి పరిస్థితులు కలిగినను మనమింకను భిక్షుకులవలెను, మోసగాండ్రవలెను చరించుట యేల?

ఐశ్వర్యమునకు అనృతము, మోసము, మార్గములని మన మెందులకు విశ్వసించుచున్నాము? పాఱవేయబడిన జంతుకళేబరభాగములను తిని బ్రతికెడు తుచ్ఛులవలె మన మెందులకు ప్రవర్తించుచున్నాము? భారతమాతయొక్క యౌన్నత్యమును తెలిసికొనక నీచముగా మనలను మన మవమానపఱచుకొనుచుండుట యెందులకు?

ఈమాడ్కి విలపించి యాశ్చర్యపడు దేశాభిమానులకు శ్రీరామకృష్ణుడు వేఱొక సందర్భమున చెప్పిన యొక కథ యుదాహరింపనగును.

ఒకనాడొక యడవిలో మేయుచున్న గొఱ్ఱెలమందపై నొక యాడుపులి పడెను. గర్భముతోనున్న ఆ పులి ఈ పరిశ్రమవలన కలిగిన సంభ్రమ ఫలితముగ ఒకకూనను ఈని అచటనే మృతిచెందెను. ఆ పులిపిల్ల యామందలోనే యుండి పెరిగి పెద్దదయ్యెను. తన యథార్థస్వభావమును గుర్తెరుంగక యది గొఱ్ఱెపిల్లలతో పాటు పచ్చిక మేయుచుండెను. ఆ పులి పిల్లకు గొఱ్ఱెల గుణములే యబ్బెను.

కొన్నిసంవత్సరము లిట్లు గడచెను. ఇంకొక పులి యా మందపై బడెను. గొఱ్ఱెలన్నియు, చెదరి నలుమూలల పారిపోయెను. పులిపిల్లయు వానితోకూడ పారిపోవసాగెను. పులిపిల్లను ఆ దాడిచేసిన పులి చూచి యిచట కిది యెటుల వచ్చినదో యని విస్మయముచెందెను. దానిని వెంట నాడి తననోటితో దానికంఠమును పట్టుకొనెను. ఆ పులి పిల్ల గొఱ్ఱెపిల్లలాగున అఱచెను. ఆ ముసలిపులి యా పులి పిల్ల నొక చెరువునొద్దకు తీసికొనివెళ్లి, నీటిలో దాని ప్రతిబింబమును జూపి, "ఓ తెలివిమాలిన పిల్లా! నీవును నేనును ఒకేజాతికిచేరినవారము. చూడుము. నీవును నావలెనే ఉన్నావు గదా! గొఱ్ఱెవలె ఏల పారిపోయెదవు?" అని చెప్పుచు నొక మాంసపుఖండమును దాని ముందువైచి

''దీనిని తిను'' మనెను. ప్రథమమున ఆ పులిపిల్ల దానిని తినక 'బా, బా' యని యఱచి తినుట కసహ్యాపడెను. కాని కొంచెముసేపటి కది మాంసముయొక్క రుచిని తెలిసికొనెను. దానిస్వభావములో గల వ్యాఘ్రత్వము బయటపడుటకు ప్రారంభమయ్యెను. అది ముక్కనంతయు పూర్తిగా తిని యింకను కావలెనని యడిగెను. ఇంతవఱకు మాటు మణిగియున్న పులిస్వభావము ఇప్పుడు తీవ్రముగా నుప్పొంగెను.

''నీ వెవ్వరో యిప్పుడు నీకు తెలిసినది కదా! నాతో రమ్ము. ఆ మందలోని గొఱ్ఱెలతో నీ కెట్టి సంబంధమును లేదు'' అని ముసలిపులి నుడివెను.

మనకు పూర్వమునుండియు అలవడియున్న దాస్య లక్షణములను తృణీకరించి, విడిచి సగౌరవమయిన మన నిజ స్వభావమును మనము వెంటనే స్థిరపఱచుకొనవలెను. దారిద్ర్యమునుగురించి సిగ్గుపడవలసిన యవసరము లేదు. కాని, హృదయముయొక్కయు, చిత్తముయొక్కయు స్వల్పత్వమునుగూర్చి బిడియపడవలెను. దారిద్ర్యములోకూడ గౌరవముగా బ్రతుకవచ్చును. మనము చెడ్డవారమయి యుండకుందుముగాక. మన మాతృభూమియొక్క నూతనగౌరవమును మనము ఆదరబుద్ధితో జ్ఞప్తియుంచుకొందుముగాక. పిరికితనమువలన కలిగిన బొంకులాడు, మోసముచేయు, గుణములను తుచ్ఛములని గ్రహించి త్యజింతుముగాక.

# 29. ప్రార్థన

ఇది చేయుము, అది చేయుము అని కోరుచు మన మెప్పాడును భగవంతుని నర్థించుచుండరాదు. దానికిమారు "నీ యాజ్ఞచొప్పున జరుగుగావుత" అని మాత్రము నుడివి, అతని యాజ్ఞప్రకారము జరుపుటతో తృప్తిచెందవలెను. ఈశ్వరాజ్ఞయందు పరిపూర్ణముగ శరణుచొచ్చు మనస్తత్త్వముయొక్క ఆవశ్యకతనుగూర్చి అన్నిశాస్త్రములు నొక్కి వక్కాణించుచున్నవి. కాని, సంస్కారమునొందజాలని మనుష్యుని స్వభావము దీనిని సులభముగా నొప్పుకొనదు. అనాదినుండియు మన ముపకారము పొందుటకు దరఖాస్తుదారులమైయుంటిమి. "సర్వము నీ కరుణ, సర్వము నీయదియే" అని నోట నుచ్చరింతుము, కాని హృదయములో మాత్రము దీనిని, దానిని కోరుచు భగవంతుడు మనము కోరినవరము లొసంగునని యాశింతుము.

భగవంతుని శాసనములు సులభగ్రాహ్యములుకావు. ఏది మంచిదో, ఏది కీడో మనకు వాస్తవముగా తెలియదు. అంతయు ఆ సర్వజ్ఞునకు విడచుట ఉచితము. ఇదియే మనకు సరియైన మార్గము. కాని మన మొకరితోనొకరు మాటలాడుకొనురీతిని ఈశ్వరునితో మాటలాడుటవలన ప్రత్యవాయము లేదు. అది సహజమైనదే. మన హృదయములోగల విషయము భగవంతునితో చెప్పుకొనిన తప్పేమి? ఏమియు లేదు. ఈశ్వరుడు సర్వమునకు ప్రభువైనప్పటికి, భార్యాభర్తలొకరితోనొకరు భాషించుకొనునంత స్వేచ్ఛగా,

మనము ప్రార్థన మూలమున భగవంతునితో మాటలాడిన చెరుపు లేదు. దినమున కొకమారైనను మనము మనస్సు విప్పి యతనితో భాషించి క్రీడించితిమేని మన తలంపులు, మాటలు, చేతలు పారిశుద్ధ్యము చెందును. మన హృదయ మాలిన్యము తప్పక వీడిపోవును. ప్రతియొకరును అనుభవము వలన ఈ నిజమును కనుగొనవచ్చును.

* * *

"మన మెట్లు ప్రార్థింపవలెను? మన ప్రార్థనలు మౌనరూపములును మానసికములునుగా మాత్రమే ఉండవలెనా? మన తలపులను బిగ్గఱగా వెలువరించుట యుక్తమా?" ఇందునుగూర్చి శ్రీరామకృష్ణునియొక్క యుపదేశమిది :

"మన కేది యానందదాయకముగా నుండునో దానిని చేయుట ఉత్తమము. మనము నెమ్మదిగా మాటలాడినను భగవంతుడు వినును. చిన్నచీమల చలనముకూడ నతడు వినగలడు."

"ప్రార్థనవలన నేమయినను ప్రయోజనముండునా?" మన తలపులు, పలుకులు సమరసములైయున్నచో మన ప్రార్థనలకు ఫలితము తప్పకయుండును. అయితే 'ఈ సర్వస్వము నీదే' యని బిగ్గఱగా చెప్పుచు, హృదయములో 'ఇదియంతయు నాదే' యని తలంచుచు భగవంతుని ప్రార్థించుట నిష్ప్రయోజనము. దేవుని మోసగింప సమకట్టకుము. ఆయనను నీవు మోసగింపలేవు. నీ హృదయ

మునకు నీవుచేయు కర్మమునకు సమరసభావముండవలెను. హృదయపూర్వకముగాను మనఃపూర్తిగాను ప్రార్థింపుము. ఈశ్వరుడు నీ ప్రార్థన నంగీకరించును. నీ వతనికి మిక్కిలి ప్రియుడవు. నియతకాలమున నీ విధ్యుక్తమును నెఱవేర్చి పిమ్మట విషయమును భగవంతునకు విడువుము. ఆతురత వదలుము.''

దిక్సూచీయంత్రము సరిగా నున్నంతవఱకు ఓడకు నెట్టి యాపద సంభవింపదు. నావలోని దిక్సూచీయంత్ర మందలి సూది యెల్లప్పుడు ఉత్తరధ్రువమును సూచించురీతి మన మనస్సు నిశ్చలముగా భగవంతునియందు లగ్నమైనచో మనము సురక్షితముగా ఓడరేవును చేరుదుము.

ఇతరులు చేయురీతి నీవు విగ్రహారాధన చేయలేక పోయినను బాధలేదు. ''నీకు రూపముకలదో లేదో నాకు తెలియదు. నీ తత్త్వము నాకు తెలియదు. నేను మూఢుడను. నీ స్వభావ మెట్టిదైనను నాకు నీ కరుణ నొసంగుము'' అని ప్రార్థింపుము.

నాయనా! ఆయనవలె నిన్ను గుఱించి అంత బాగుగ జాగ్రత్తపడువా రెవరును లేరు. నీ అన్నిప్రార్థనలను అత డాలకించును. నీ కేది మంచిదో యతనికి తెలియును. ఒకదినమున ఆయన నీకు తప్పక తన దర్శనభాగ్య మొసగును. చివరకు నీవు మరణావస్థలో నున్నప్పుడయినను అతడు నీకు ప్రత్యక్షమగును. కాని ప్రార్థనచేయుట వీడకుము. కష్టములందుగాని, సుఖములందుగాని నీవు సంభా

పించుటకు అతనివంటివారు ఇతరు లెవరును లేరు. దేవునితో భాషించుటయే ప్రార్థన. మూగగా మనుష్యులుండజాలరు. వా రితరులతో మాటలాడుదురు. ప్రార్థన ఈ ధర్మమునకు చెందినది.

## 30. ఆరని దీపము

జీవనము సల్పుటకు సహాకారములుగ నుండునను నమ్మకముతో మనుజులు అబద్ధములకు మోసములకు అల వాటుపడిరి. నీతి నిష్ప్రయోజనమని త్రోసివేయుదురు. కాని అది న్యాయపథము కానేరదు. ధర్మము మాత్రమే మంచిది. అదియే సుఖము, నిపుణత, ధనము. ధర్మము క్షీణించినచో దేశము వృద్ధిలోనికి రాదు. ప్రతి మనుజుడును దరిద్రు డగును. సంఘమును మోసము, అబద్ధము నాశము చేయును. సంఘము నశించిన మన మందరము నశింతుము.

కొందరు జాలరిస్త్రీలు ఒకానొకప్పుడు ప్రొద్దు పోయిన పిదప సంతనుండి యింటికి వచ్చుచుండిరి. సంతలో వర్షము కురియుట వలన వారి కాలస్యమయ్యెను. ఇంటికి వచ్చు త్రోవలో వారొక పూలతోటకు సమీపములోనున్న గుడిసెయొద్ద విశ్రమించిరి. ఆ తోటమాలి యోగ్యుడగుటచే వారి నా రాత్రి యచటనుండి వేకువజామున పొమ్మని కోరెను. ఆ స్త్రీ లందులకు సమ్మతించి యచట ఆగిరి.

ఆ రాత్రి వారిలో నొకరికైనను నిద్ర పట్టలేదు. భూమిపై దొరలిరే గాని నిద్రపోజాలకపోయిరి.

వారున్న గదిలో నొక మల్లెపూల గంప యుండెను. మఱునా డుదయమున అమ్ముకొనుటకుగాను అది యుంచబడి యుండెను. ఆ పువ్వుల సువాసనను ఆ స్త్రీలు భరింపజాలక పోవుటచే వారికి నిద్రపట్టలేదు. కొంతసేపటి కందులో నొకత "ఈ దుర్గంధము నిలచుటలేదు. పోనుపోను హెచ్చుగుచున్నది. దీని నాపుటకు మన మేమయినను చేయవలెను" అని పలికెను.

కొంచెము నీరు తీసికొని చేపల గంపలపై చల్లి వానిని సమీపమున కీడ్చుకొనిరి. చేపలవాసన మల్లెపూల వాసనను ముంచివేసెను. అంతట నా స్త్రీలు గాఢనిద్ర చెందిరి.

* * *

తమతమ రుచుల కానుగుణ్యముగ ప్రతివారును ఆనందముయొక్క స్వరూపము నూహించుకొందురు. సద్గోష్ఠి, సదభ్యాసములు మన జీవితమును నడుపవేని చెడ్డమార్గములం శ్రేష్ఠములుగా తోచుటయే గాక, మన జీవితమున కత్యావసరముగాకూడ తోచును.

ఈ కలియుగములో మనము చేయవలసిన తపస్సు ఒకటియే. సత్యము పలుకుటయే అది. కాని ఆ ఒక్కదానిని గూడ మనము నిరాకరింతుము. వర్తకులు, ఉద్యోగులు, అందరును నిజము పలుకవలెను. సత్యమే తెలివి. భగవంతుని చేరుటకును జీవితములో నిజమగు జయము పొందుటకును అదియే మార్గము.

కొన్ని పండుగదినములలో ఆరిపోకూడని దీపములను మనము వెలిగింతుము. అవి యెల్లప్పుడును వెలుగుచునే

యుండవలెను. ఆరిపోయెనేని కుటుంబమున కేదియో విపత్తు సంభవించునని భయపడుదుము. అట్లే భగవంతుని గూర్చిన తలంపు మన హృదయములో నిడిన ఆరిపోకూడని దీపము వంటిది. మన హృదయములో వెలిగింపబడిన ఆ దీపము ఎప్పుడును ఆరిపోవక యుండునట్లు మనము జాగ్రత్త పడవలెను. మనమేమి చేయుచున్నను దీపమున కవసరమగు నూనెను అప్పుడప్పుడు ఉంచుచు వత్తిని సరిగా కత్తిరించుచుండవలెను. దానిచేత దేనికిని అడ్డు సంభవింపదు. అప్పుడు నిజమైన జయము మనకు సమకూరును.

## 31. కమలయొక్క అద్దము

"అమ్మా! నీవు నాకిచ్చిన యద్దము ఎందులకును పనికిరాదు. అందులో నా ముఖము సరిగా ప్రతిబింబింపదు" అని కమల యనెను.

"కాదు కమలా! అద్దములో తప్పేమియు లేదు. అది యిప్పుడు దుమ్ముతో నిండి యున్నది. దానిని నీవు తుడువవలెను. అంతియే" యని తల్లి యనెను. అంతట ఆమె యొక గుడ్డపీలికతో అద్దమును తుడిచి బిడ్డ కిచ్చెను. కమల అద్దము చూచుకొని తన ముఖము అందులో చక్కగా ప్రతిఫలించుట కాంచి సంతోషించెను.

ధ్యానమునందు భగవంతుని చూచుటలోని రహస్య మిదియే. నీ హృదయమును నిర్మలముగా నుంచుకొందువేని భగవంతుని చూతువు. నీ హృదయము కామకాంచనములచే మలినమైయున్నచో నీవు భగవంతుని చూడజాలవు. తన

చము అగాధమగు గోయివంటిది. బిడ్డ లోతు బావిలో తొంగి చూచునేని "అచట నిలువకుము. అందులో తొంగి చూడకుము. తొలగి దూరముగా నిలువుము" అని చెప్పు దుము. జీవితము తెలియరాని యుపద్రవములతో నిండి యున్నది. అందులో పడితిమేని తిరిగి తప్పించుకొని రాజాలము.

"ధనతృష్ణను, కోపమును విడనాడుట సులభము కాదు. మనము వానిని పూర్తిగా విడనాడ జాలమేని, వాని వలని హాని తఱిగి పోవు మార్గమునకు వానిని మరల్పవలెను. భగవంతుని కామింపుము. నీ కోరికలను నీ శక్తిని ఈశ్వరా న్వేషణ వైపునకు మరల్పుము. నీ కోపమును కూడ భగ వంతునివైపు త్రిప్పుము : ఆయన నీకు దర్శన మీయనందులకు ఆయన యెడల నీ యసహనమును చూపుము. నీ తోడి వారిపై నీ కాగ్రహము కలిగినపుడు దానిని భగవంతుని పైకి ప్రసరింప జేయుము" అని పరమహంస నుడివెను. మన స్వభావమునందలి మాలిన్యమును వెడలగొట్టి దానిని పరిశుభ్రపఱచుకొనుటకు ఇదియే మార్గము.

*　　　*　　　*

అడవిమృగములను మనము మచ్చిక చేయుదుము. గజమును సైతము స్వాధీనపఱచుకొని మనకు విధేయమగు నట్లు దానిని తయారుచేయుదుము. కృషి చేసితిమేని మన స్సును సైతము మచ్చికపఱచి స్వాధీనము చేసికొనవగును. నీ మనస్సు స్వేచ్ఛగా అడవిలో సంచరింపకుండ అదుపులో నుంచు కొనుము. అడవిలో వృక్షము లట్లు పనికిమాలిన తలంపులు

ందు నిండియుండును. ఆ తలంపులందే మగ్నమై
ంచ్చినచో మనస్సు (శిక్షణ మెఱుగని) అడవియేనుగుగ
ంచును. అప్పుడది స్వాధీనము తప్పిపోవును. బుద్ధి దాని
ము. దానితో మనస్సును స్వాధీనపఱచుకొనగలము.
అనురాగములు, కోరికలు క్రమశః వీడనగును.
పెరుగనిచ్చితిమేని బుద్ధి నశించును. కలుపు పెరిగి
ఏ మొక్కయయినను నశించును. కలుపుతీసిన,
పెరుగును. కోరికలు, అనురాగములు అనెడు
ఎక్కువగ పెరుగబారినచో బుద్ధియను లేతమొక్క
షక నశించును.

## 32. ఆత్మరక్షణము, పరులకు ప్రబోధనము

మతసంబంధములయిన ప్రసంగముల మూలమునను,
థాకథన మూలమునను అనేకులు మనకు మన ధర్మ
బోధచేయ జూతురు. వారు గొప్ప విద్వాంసులే.
యుద్దేశములే వారి బోధన ప్రయత్నములకు
ము. కాని మనుష్యులు సంస్కారము నొందవలె
మతప్రబోధముతోపాటు నిజమయిన భక్తియొక్క
కూడ మిళితము కావలెను. బోధకుని భక్తి శ్రోతల
సము నాకర్షింపవలెను. లేనిచో ఎంత పాండిత్య
గూడిన యుపన్యాసమైనను వృథాయగును.
ఒకానొక సమయమున మత ప్రచారకులను గుఱించి
ృష్ణభగవానుని యభిప్రాయము నడిగిరి. అందు
ఇట్లు బదులు చెప్పెను: ‘‘సామాన్య మతప్రచా

రకులు తమ ఆకలితీర్చుకొనుటకే తగినంత ఆహారములేక యుండియు, నూరుమందిని విందునకు పిలుచువారివంటివారు. అతని భక్తి అతనికే ముక్తి లభింపజేయజాలదు. అట్టిచో ఇతరుల హృదయములలో అతడు ఎట్లు భక్తిని కలిగింపగలడు?"

తొలుత మన హృదయములలో మనము భగవంతుని స్థాపించుకొనవలెను. తరువాత మన మితరులకు బోధచేయ నుద్యమింపవచ్చును. మనమే మోహము, కోపము వదలించుకొనలేనప్పుడు ఇతరులకు భక్తిని, వైరాగ్యమును బోధింపలేము. ఇతరులకు చెప్పుట సులభమే. విగ్రహములేని శూన్య దేవాలయములో గంటలుకొట్టుచు, శంఖము పూరించినట్లు అట్టి ప్రబోధముండును.

* * *

సంపూర్ణ భక్తితో భగవంతునకు శరణాగతులమైతిమేని, మనకు పూర్ణత్వము లేకపోయినను ఇతరులను మంచి మార్గములోపెట్ట యత్నింపవచ్చును. అట్టి మనుజు నొక్కని తాను కలిసికొనిన యుదంతము శ్రీరామకృష్ణభగవానుడు నుడివెను. "అయ్యా! మీరు మిక్కిలి ఆవేశముతో ధర్మబోధ చేయుచున్నారు. మీ జీవిత చరిత్ర మంతగా కళంకరహితము కాదు. అయినను మీ రందరి నాకర్షించి భక్తిమార్గములో వారిని దింపుచున్నారు. దీని రహస్యమేమి?" యని పరమహంస ప్రశ్నించెను.

"నేను వాస్తవముగా అధమాధముడను. కాని ఈశ్వరకృప ఆశ్చర్యకరములయిన పనులు చేయించును.

మలినమయిన చీపురు వీథులు శుభ్రపఱచుట కుపకరించునని తమకు విదితమే. భగవంతుని చేతిలోగల అట్టి చీపురు కట్టను నేను. ఆయన మనుష్యుల హృదయములోని మలినము తుడుచుటకు నన్నుపయోగించును'' అని యా మనుష్యుడు బదులు చెప్పెను. ఇందులకు ప్రత్యుత్తరము లేదని శ్రీరామకృష్ణు డనుకొనెను.

*　　　*　　　*

హృదయములో నిజమయిన భక్తియున్నప్పుడు భగవంతుడే అందు నివసించును. సూర్యకిరణములు తమ వెలుతురును, వేడిమిని ప్రసరింపజేయుటకు ఎటువంటి మేఘమయినను ఎటు లడ్డుపడనేరదో, అట్లే నిజమైన భక్తుని యొక్క భక్తి ఇతరుల హృదయములలో చొచ్చుటకు ఏదిగాని అవరోధమును కల్పింపజాలదు.

## 33. సంశయము నుంచుకొనకుము

''నీ స్వభావమును మార్చుకొని స్వాధీనములోనికి తెచ్చుకొనుట ఎట్లు అని యాతురతపడకుము. బొగ్గు చాల నల్లనిది. నిప్పుతోకూడినపు డది తేజోవంతమగును. దానికి స్వాభావికమగు నలు పంతరించును. అదేమాదిరి జ్ఞానమను అగ్నితో సంపర్కము గలిగినపుడు నీ హృదయములోని మాలిన్య మంతరించును.''

నీ హృదయమును పరిశుభ్రముగాను, మాలిన్యరహితముగాను ఉంచుకొనుము. మంచిచేయు శక్తి నీ కప్పుడు

అపారమై యుండును. అప్పుడే చాకిరేవునుండివచ్చిన తెల్ల గుడ్డకు ఏ రంగువేసినను పట్టును. మనస్సు చాకిరేవు నుండి అప్పుడే వచ్చినగుడ్డవంటిది. సత్సాంగత్యము, హృదయపూర్వకప్రయత్నము దాని నీశ్వరునివైపునకు త్రిప్పును. ఆంగ్లవిద్య నభ్యసించినవారి యుపన్యాసమును వినుము. వారెక్కువ యాంగ్లపదములను వాడుదురు. సంస్కృతపండితులు ఎక్కువ సంస్కృతపదముల నుపయోగింతురు. సత్సాంగత్యముకలవారియొక్క మనస్సు పాపమువైపునకు ఎప్పుడుగాని తిరుగదు. దుస్సాంగత్యముకలవారు సదా పాపపు సంగతులనే తలపోయుచుందురు. తా మెట్టివారితో సాంగత్యము చేయుదురో అట్టివారి రంగు (లక్షణములు) తమ తలంపులకు పట్టును. సత్సాంగత్యము నైతిక భావములకు దోహదమునిచ్చును. దుస్సాంగత్యము చెడు తలంపులనే వృద్ధిచేయుచుండును.

మనలను మనము మోసపుచ్చుకొనకుండ ఉందుముగాక! సత్యము, భక్తిమాత్రమే భగవంతుని సాన్నిధ్యమునకు చేరుటకు మార్గములు. దేవుని మఱచితిమేని మృతి నొందుదుము. భక్తి లేనిదే మనము నిజముగ బ్రతుకనే లేము.

జ్ఞానము, భక్తి వేరు కావు. భక్తియును సత్యమును గూడి జ్ఞానము అగును. ఇతరులను చంపుటకు ఖడ్గముగాని తుపాకి గాని కావలెను. ఆత్మహత్య కొరకు సూదియే చాలును. అట్లే ఇతరులకు బోధ చేసి వారి యజ్ఞానము పోగొట్టుటకు చాల జ్ఞానము కావలెను. భగవంతుని తన

హృదయము లోపలకు తెచ్చుకొనుటకు ఎక్కువ పాండిత్యము అవసరము లేదు. భక్తి మాత్రమే చాలును.

అన్ని మతములకు మూలము భక్తి. ఒకడు నిజమయిన భక్తి గలిగినవాడైనచో, అతని మతము అతని యవసరములకు చాలును. చదువు మూలమున గాని, ఇతర మతములలో కలియుటవలన గాని, భక్తి లేనివానికి నిజమయిన జ్ఞానము కలుగదు.

* * *

"నా ఆవు ఇది తినును, ఇది తినదు" అనుచు పశులకాపరి తన కిష్టము వచ్చిన పదార్థములతో తన ఆవును మేపును. ఆవు దానిని వాసన చూచి చూడకయే తల త్రిప్పికొనును. అది యెక్కువ పాల నీయదు. కాని, ఏది పెట్టినను ఎక్కువ ఆప్యాయతతో తిను ఆవు, పాలు బాగుగ నిచ్చును. సంశయాయత్తచిత్తములనుండి జ్ఞాన మనెడు పాలు ధారాళముగ ప్రవహింపవు.

* * *

తృష్ణతో బాధపడునతడు చివరకు నదిలోని మురికి నీటితోనైనను తన దప్పిని తీర్చుకొన సమకట్టును. పరిశుభ్రమైన నీటికొఱకు అచట నూతిని త్రవ్వ నారంభింపడు. భగవంతునియందలి తృష్ణయు నిట్టిదే. ఆయనయందు తృష్ణగలవారు తమ మతము దోషయుక్తముగ కనబడు చున్నను, క్రొత్త మతములకై అన్వేషించుచుండరు. ఒక నూత్న మతమునుకూడ స్థాపింప జూడరు. భగవంతుని కొఱ

కొకనికి నిజమైన తృష్ణ గలిగెనేని స్వమతసాహాయ్యముననే తనదప్పిని చల్లార్చుకొనుటకు యత్నించును. నూతనసిద్ధాంతములను కల్పించుటతో తన కాలమును వ్యర్థపరుచుకొనడు.

లుబ్ధుడు ద్రవ్యముకొఱకై యెట్లత్యాశపడునో అట్లనే భక్తుడు భగవంతుని కొఱకు కూడ తపించుచుండును. మునిగిపోవుచున్నవాడు ఊపిరాడక ఎట్లు ఉక్కిరి బిక్కిరి యగునో అట్లే అతడును భగవంతునికొఱకు ఆతురతపడును.

"కొందరు శుద్ధినమ్మకమును గూర్చి నిరసనభావముతో మాటలాడుదురు. వారి యుద్దేశము నాకు బోధపడదు. శుద్ధినమ్మకమను మాటకు వారి యర్థమేమి? 'శుద్ధి భక్తి' యనునొక ప్రత్యేకవిధమగు భక్తి లేదు. 'జ్ఞాన' మున్నది. 'భక్తి' యున్నది. భక్తికి కన్నులు లేవు. భక్తి యంతయు శుద్ధిదే" యని శ్రీరామకృష్ణుడనెను.

నాస్తిక జీవితము సల్ప సమకట్టితిమేని మనకు నాశమే సంభవించును. సంశయములనన్నిటిని వీడి గాఢమయిన భక్తిని వృద్ధిపఱచుకొనవలెను. ప్రపంచము శూన్యమునుండి యుద్భవింపలేదు. శూన్యమునుండి మనుజుని ప్రాణము, తలంపు జనింపగలవా? పరమేశ్వరుడుండుటను గుఱించిగాని, ఈశ్వరకటాక్షముయొక్క సత్యమునుగుఱించిగాని మనకెట్టి సందేహము ఉండ నవసరము లేదు.

"నరకమును గురించిన తలంపులతో బాధపడకుము. భగవంతుని చింతించి యతని నిట్లు ప్రార్థింపుము: 'నే ననేక నిషిద్ధకృత్యములను చేసితిని. విధ్యుక్తములయిన పనుల

ననేకములను నేను చేయనైతిని. ఓ ఈశ్వరా! నాయందు కరుణింపుము' నీ పాపపుంజములు భస్మీపటలమై పోవును" అని శ్రీ రామకృష్ణ భగవానులు చెప్పిరి.

## 34. ముసలమ్మకు సలహా

బ్రాహ్మసమాజప్రధానాచార్యుడగు కేశవచంద్ర సేనుతో ముచ్చటించుచు శ్రీరామకృష్ణపరమహంస యొకానొకప్పు డిట్లు చెప్పెను: "నీవు జగమును సృష్టించితివి. నీ మహిమ వర్ణనాతీతము. నీవిది చేసితివి. అది చేసితివి' అని భగవంతుని ప్రార్థించుటవలన ప్రయోజనమేమి? తండ్రి ముందఱ కుమారుడు కూర్చొని, 'ఆహా! నా తండ్రికింతమంది నౌకరులున్నారు, ఇన్ని గుఱ్ఱము లున్నవి, ఇన్ని బండ్లున్నవి, ఇన్ని తోటలున్నవి' అని ప్రశంసించునా? అట్లు చేయడు. ప్రేమగల కుమారుడు తండ్రియొక్క సంపద నిట్లు ప్రశంసింపడు. తండ్రియొక్క ప్రేమనుగురించి కూడ ఎక్కువ తలపోయడు. అవి యుండుట చిత్రముగాదని అతనికి తెలియును.

"మనము భగవంతుని బిడ్డలము. ఆయన ప్రేమ ప్రకృతి సూత్రము. దానిని గురించి యాశ్చర్యము కనుపఱచుటగాని, భాషించుటగాని, స్మరించుటగాని అనవసరము. ఇట్టి వృథాప్రలాపములతో మనము కాలము వ్యర్థపఱచుకొనరాదు. సరిగా భగవత్సన్నిధానమును చేరుటకే సమకట్టవలెను. భార్య భర్తను సమీపించు రీతినిగాని, బిడ్డ తల్లిని చేరుమాడ్కిగాని, యతనియొద్దకు మనము చేర

వలయును. మనమతనిని చనవుతో సమీపించి భర్తను భార్య కోరురీతిగ, తండ్రిని బిడ్డ కోరురీతిగ, మనకు కావలసిన పనిని చేయుమని అడుగవచ్చును. దూరముగానున్నచో, మనము అతని నాలింగనము చేసికొననేరము. ఆయన దగ్గఱకు వెళ్లుటకు భయపడరాదు. అతడు నీవాడే యనియు, నీ బంధువులందరికన్నను నీకు సమీపస్థుడనియు నమ్ముము. ఆయనతో నీవు పూర్ణమగు చనవుతో దాపరిక మేమియు లేక వ్యవహరింపవచ్చును.''

భక్తిమార్గముయొక్క రహస్యమిదియే. భక్తిలో భయమునకుగాని, ఆశ్చర్యమునకుగాని—అణకువకైనగాని తావులేదు. ప్రేమ, విశ్వాసము, శ్రద్ధ: భక్తియొక్క లక్షణాములు. ఆరంభములో జంకు—భయమునైతము—ఉండవచ్చును. భక్తి విజృంభించుకొలది వాని స్థానమున విశ్వాసము జనించును. భక్తుడప్పట్టున భగవంతుని తన స్వంతసొమ్ముగ ఎంచి యతనిని చేరును.

*                    *                    *

తన శిష్యులలో నొకరితల్లి యొకప్పుడు శ్రీరామకృష్ణునియొద్దకు వచ్చి యిట్లనెను: ''నేను ముసలిదానవయితిని. నా కుటుంబచింతలను వదల్చుకొన దలచితిని. బృందావనమునకుపోయి రాధాసాన్నిధ్యమున విరక్తిమార్గమవలంబించి కాలముగడప నెంచితిని.''

పరమహంస ఆ ముసలికి నిజముగా నిది సాధ్యము కాదనియు, ఆమె వైరాగ్య మాహాప్రపంచములోనిదే

యనియు, ఆమె కింకను కుటుంబాసక్తి పూర్తిగా వీడ లేదనియు తెలిసి, యామెతో నిట్లనెను :

"అమ్మా! నీ మనుమరాలియెడ నీకు గల యనురాగము నాకు తెలియును. నీవు బృందావనమున కేగినను మఱి యే యితర ప్రదేశమునకు జనినను, ఎచటికి పోయినను, నీ మనుమరాలిని మరువజాలవు. నీవు లేనియప్పు డామెకు సంరక్షణ జరుగుచున్నదో లేదో యని ఆలోచించుచుందువు. నీ శరీరము బృందావనములో నున్నను, నీ మనస్సంతయు మనుమరాలి మీదనే యుండును. కాని నీ మనుమరాలినే దేవిగా నెంచి నీ ప్రేమ నామె యెడల జూపుము. ఇంటి యందే యుండి బిడ్డను జాగ్రత్తగా జూచుకొనుచు ఆమె రాధయే యను భావము నీ మనస్సున కెక్కునట్లు చేసికొనుము. బిడ్డయందలి ప్రేమ యావత్తు దేవియెడల భక్తిగా మారును. పిల్ల నాడించు నపుడు, దాని కాహారమిడు నపుడు, బొట్టునుదుట నుంచునపుడు, సదా నీ విది యంతయు దేవికే చేయుచున్నట్లూహింపుము. అప్పుడు నీవు స్వస్థలములో నున్నను, వైరాగ్యముయొక్క లాభమును, బృందావనములోనుండి కృష్ణుని భజించు లాభమును పొందుదువు."

* * *

"నీవెవరిని ప్రేమించినను—బిడ్డనుగాని, తల్లినిగాని, తండ్రినిగాని, స్నేహితునిగాని—ఆవ్యక్తి భగవత్స్వరూపమే యనియు, దేవియొక్క యపరావతారమే యనియు ఎంచుట నలవరచుకొనుము. ఇది మనకందఱకు సులభమయినట్టిదియు,

అమోఘమైనట్టిదియు నగు మార్గము. ఇదియే మన జీవితమును మాలిన్యరహితముగా చేసికొను పథము" అని శ్రీ రామకృష్ణుడు బోధించెను.

## 35. గోపాలు డెచట?

ఒకనాడు అర్ధ నిశాసమయమున రామస్వామిపడైయాచి నిద్రనుండి మేల్కాంచెను: సమీపమున నున్న యరణ్యమున గల తన స్నేహితుడు సెంగోడన్ గుడిసెకు జనెను. పేరుతో పిలుచుచు తలుపు తట్టెను. సెంగోడన్ నిద్రలేచి "నీకేమి కావలెను? ఇట్టి రాత్రిసమయములో నన్నెందులకు నిద్రలేపితివి!" అని యడిగెను.

"చుట్ట కాల్చుకొనుటకు నిప్పుపుల్ల కావలెను" అని పడైయాచి బదులు చెప్పెను. "ఎంత వేడుకగా నున్నది, నీ చేతిలోని దీపముతో ఏల చుట్ట కాల్చుకొనలేదు?" అని సెంగోడన్ ఆశ్చర్యముతో పల్కెను.

తన చేతిలోని లాంతరులో నిప్పున్నదని రామస్వామికి జ్ఞప్తికి రాలేదు. భగవంతుడు తమ హృదయములలోనే శాశ్వత నివాసము చేయుచుండుట తెలియక, బయట నెచటనో కలడని వెదకువారి తెలివితక్కువతనమును స్పష్టము చేయుటకు శ్రీ రామకృష్ణుడు ఈ పైకథ నుడివెను.

తన వక్షఃస్థలమును చూపుచు, "ఇచట భగవంతుని జూచువాడు బాహ్యప్రపంచమంతటిలోను అతని యునికిని చూచును. తన హృదయములో భగవంతుని చూడనివాడు మరెచటను అతనిని జూడజాలడు. తన హృదయమను గుడిలో

భగవంతుని దర్శింపగలిగిన యతడు కాశిలోను, కంచిలోను అతనిని చూడగలడు. అపు డతనికి బ్రహ్మాండమంతయు దేవుని యొక్క యొక గొప్ప దేవాలయమని తెలియవచ్చును. హృదయములో ఈశ్వరుని సందర్శింపలేకపోయి ఆకాశవీధి యందును, అంతకన్న ఉన్నతమైన ప్రాంతములందును ఆయ నను వెదకునతడు అవిద్యచే ఆవరింపబడినవాడని మనము నిశ్చయించుకొననగును, జ్ఞానజ్యోతి వెలుగునపుడు ఈశ్వ రుడు హృదయమను దేవాలయములో ప్రజ్వరిల్లును.

హృదయమునందు భగవంతుని దర్శించుట యనగా ఇతరులు అందునుగురించి నుడివిన పలుకుల నంగీకరించుట కాదు. దానిని తద్గర్భితభావసహితముగ గ్రహించి, తదను సారముగ తన జీవితమును మార్చుకొనవలయును. భగ వంతుని తన హృదయములో కనుగొనిన యతని జీవిత మంతయు పూర్తిగ మారిపోవును. చాలకాలముక్రిందట డబ్బుసంచి పోగొట్టుకొని వెదకుచు తుదకు తన జేబులోనే దానిని కనుగొనినవానివలె అతడుండును. తల్లి తనబిడ్డ చని పోయినట్లు కలగనెనని యనుకొనుము. కలలో ఆ బిడ్డకై వెతకి అది కానరానందున విలపించును. హఠాత్తుగ మేల్కాంచి ఆ బిడ్డ తనప్రక్కననే సుఖముగా నిద్రించుట చూచును. ఆమె కెంత సంతోషమగునో దానిని స్మరిం పుము. ఈశ్వరుడు మన హృదయమునందుండుట ఎఱిగి నప్పుడు మనము అట్టి యానందమే పొందుదుము.

*   *   *

ఒకదినమున మిక్కిలి ఆతురతతో యశోద రాధను "నా గోపాలుడెచట ? ఇంకను ఇంటికి రాలేదే. అతడెచటికి వెళ్లినది నీకు తెలియునా?" అని యడిగెను.

రాధ నిద్రలేచి "అమ్మా! నీ వాతురతపడకుము. కన్నులను మూసికొని గోపాలుని గుఱించి ధ్యానము చేయుము. వెంటనే నీ వతనిని చూతువు" అనెను. యశోద అట్లొనర్చి తన ముద్దులగోపాలుని చూచెను.

అంతట యశోద రాధ నొకవర మడిగెను. "రాధా! నా కన్నతల్లీ! నీ భక్తియొక్క ఫలితమే నీ శక్తి. నాకు కూడ దానినీయవా? నాకు మార్గము చూపుము." యశోద వరమును బడసెను.

అన్నిచోట్లను, ఎల్లప్పుడును, మనముకూడ రాధా యశోదలమాడ్కి గోపాలుని చూడనగును. అయినను మనముకూడ రాధాయశోదలవలె గోపాలుని చూచుటకు ఆవేదనపడవలెను. ఆవేదన హృదయములో నుద్భవింపవలెను. నిజమయిన ఆవేదనతో మనము కోరితిమేని భగవత్సందర్శనము మనకు తప్పక సంభవించునని కఠోపనిషత్తు చెప్పుచున్నది.

శ్రీ రామకృష్ణార్పణమస్తు.